R. NUMBERS

Rēkapallimahādēva Kavı—
Cınnı Venkatanarasīyamu 986 (B)
Rudraya—
Sugrīvavıjayamu . . 934
Sanjīvarāya Kavı—
Bhāgavatamu 1064 (E)
Śaṅkarācarya—
Atmabōdhaprakaranamu . 868 (c)
Daksıhınāmūrtyastakatıka . 868 (d)
Sankuśāla-Nrsımha Kavı—
Kavı Karṇarasāyanamu 922
Sannıdhırājujagannātha Kavı—
Jñāña Kuravañjı 926
Sannyāsı Kavı—
Gunḍayya Carıtra . 973
Sāraṅgutammaıya—
Vaıjayantīvılāsamu 923 (B)
Sēsācaladāsa—
Bhūsaṇavıkāsa Śatakamu 881 (B)
Sōmanamantrı—
Vasucarıtravyākhya .. 860,866, 916
Sōmanāthudu—
Sūta Samhıta . .. . 1002
Srīnātha Kavı—
Sṛngāranaısadhamu . 894
Sūraya Kavı—
Vanamālıvılāsamu . 1053
Tadakamalla Venkatakrsna Rao—
Sıddhānta Saṅgrahamu 1037
Tādēpallı-pānakālarāyadu—
Manasabdōha Śatakamu 874 (A)
Tallapāka-Tıruvengalanāthudu—
Usā Kalyāṇamu 1015
Tāmarapallı Tımmaya—
Sēsadharmamulu 905
Tarıgonda-Vengamāmba—
Vısnupārıjātamu 1056
Ramāparınayamu 1057
Tikkana—
Mahābhāratamu 822, 833, 834, 838, 849, 859 (C) 867, 919, 923 (a), 951 956, 959, 968 to 970, 988
Tıkkana Sōmayājı—
Kavisārvabhaumachandassu .. 1010

R. NUMBERS

Tımmanakavı—
Mahā Bhrāātamu (Dvıpada). 895, 896
Tımmaya—
Dvıpadabhāgavatamu 927
Tırumalarāju Sūraparāju—
Draupadīparıṇayamu .. 958
Tırupatı Kavı—
Hanumadvıjayamu . 939
Sundara Kānḍamu 870 (B)
Vangala-Sītārāmācāryudu—
Jagannāthamāhātmyamu . 970 (B)
Vangīpura-Narasımhācāryuḍu—
Kalāpūrnōdayamu (wıth meanıng) 1059
Vangıpuram-Sītārāma Kavı—
Ācāryaratnahāramu . 906
Vangūrı-Narasımha Kavı—
Prasannarāghava Śatakamu . 1035 (A)
Varadavēdāntācāryudu—
Śabdatatvavıvēkamu 1044
Vāranāsı-Venkatēswara Kavı—
Rāmacandrōpākhyānamu 941
Vēgınātı-Kondaıya—
Muktıkāntāparıṇayamu 891 (A)
Vēgınātı Kondanāryudu—
Vıvēkasındhuvu . 994 (B)
Velıdındla-Venkatapatı Kavı—
Radhāmādhava Samvādamu. 841 (A),
Vellankı-Tātambhattu—
Kavıcıntāmanı . 1058
Venkatanārāyanāryudu—
Gītagōvındamu . .. 882
Vēnkatanātha Kavi—
Pancatantramu .. . 847, 930
Venkatarāmarāju—
Sakalavēdantasıddhānta Sārasangrahamu 967 (B)
Venkatarāmāryudu —
Vēdanārāyana Śatakamu .. 1033
Vennelakanṭı-Sūrana—
Vısnupurāṇamu . .. 827
Vīranarādhyudu—
Gangāgaurīśavılāsamu .. 993
Yōgānandāvadhūta—
Guruśısya Samvādamu .. 881

# A TRIENNIAL CATALOGUE OF MANUSCRIPTS.

## 1928-1929 TO 1940-1941.

## Volume VI.

## PART 3—TELUGU.

R No 813.

**Palm-leaf. Size, 13½ × 1⅝ inches. Foll. 71. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

కుశలవయుద్ధము (యక్షగానము).

KUŚALAVAYUDDHAMU (YAKSAGĀNA)

The story of Uttararāmāyana is described in this work. The author is Anantadāsa, son of Keśavadhīra of Tirunagari and a pupil of Rāmānujācārya, son of Singarācārya. The work is dedicated to God Narasimha of Vēdagiri.

Incomplete.

**Beginning :**

ఉ. శ్రీధరు నాదిదేవు నరసింహావతారు సురారిభంజనున్
మాధవు శంఖచక్రధరు మండితరత్నవిభూషణున్హరిన్
సాధుజనార్చితున్వరదు సారసలోచను చందనామయున్ ?
భూధరు కృష్ణవర్ణు ఘను భోగవిలాసునకేను మ్రొక్కెదన్.

ఇట్లు జగద్భర్తయైన మహానుభావునకు షష్ఠ్యంతంబులు చెప్పెదను

అర్ధచంద్రికలు.

సురగణనుతకర సుగుణాత్మునకున్
జలచరుండగు అలజగదీశునకున్

* * * *

కల్కిరూపుండగు కమలాపతికిన్
శ్రీవేదగిరి నరసింహదేవునకున్

మరియు సదాచార్యులగొనియాడెదను.

ద్విపద.

శ్రీమంతు వేదాంత సిద్ధాంతవేద్యు
పామరగుణభేద ప్రౌఢసత్కార్యు
జనపాపసంహారు జగదేకవీరు
ఘనభక్తమందారు కరుణాగభీరు
వితరణసాహసు వేదప్రకాశు
పతితపావననాథు భక్తసుప్రీతు
చెలగపల్లెరు ముని శింగరాచార్యు ?
విలసితపాదాబ్జు విదితసత్పుత్రు
డగునట్టి రామానుజార్యులపాద
యుగళంబులకు మ్రొక్కి యుచితసద్భక్తి
విరచితంబుగకీర్తి విస్తారముగను
తిరునగరికేశవ ధీగతనూజుఁ
డగుచు శేషాఖ్యుఁ డనంతదాసాఖ్యుఁ
డగువాఁడమును కవితాచార్యులనెల్ల
మదిదలచి సద్భక్తి మహిమగొనియాడి
విదితముగనీకథ విస్తారముగను
కేవలముగనేను కృతిసేయఁబూని
భావించి యార్యుల ప్రణుతించి మించి
సార్వభౌముడు సీతసత్యమెన్నకను
విర్యుడై శ్రీరాము విపినభూములకు ?
అనుపఁ యును బోయినటుతర్వాత ?
వనిత వాల్మీకి ఋషివద్దజేరఁటయు
నుర్వగా కుశలవుల యుద్ధకాండయును
సర్వంబు శ్రీవేదశైలాధిపతికి
నర్పింతు నీకథ యంకితంబుగను
నేర్పుగాబుధులెన్న నే రచియింతు
జనులెల్ల నిరతంబు సద్భక్తితోడ
వినరయ్య తత్కథాక్రమ మెట్టిదనిన

యదుకుల కాంభోది రాగం, ఆది తాళం.

భృత్యుడొప్పను చూడరమ్మ
తుమ్రూలవీరూలఁగాంచి ద్రుంచెదనని ॥భృత్యు॥

**End :**

ద్విపదార్థం—

ఓరిబాలకులార ఉత్తరభూమి
చేరకుమని బుద్ధిచెప్పియుండగను

* * * *

అనిన బాలులిట్లనిరి

కందార్థం—

మాతండ్రులనుచు నెవ్వరు
ఖ్యాతిగచెప్పంగ. . . . . . . . . . .
. . . . . . . . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములుగలవు.

ఉత్తరరామాయణకథ యక్షగాన రూపముగా వర్ణింపఁబడినది. కర్త అనంతదాసుఁడు. తిరునగరికేశవధీరుని కుమారుఁడు. శింగరాచార్యుల కుమారుఁడగు రామానుజాచార్యుల శిష్యుఁడు. వేదగిరి నరసింహస్వామికి కృతియంకితము.

---

## R. No 814.

**Palm-leaf. Size, 17½ × 1¼ inches. Foll. 274. Lines, 5 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతకూలంకష

MAHĀBHĀRATAKŪLAṄKAṢA.

Contains the Commentary, called Kūlankaṣa for the fourth Āśvāsa of Mahā Bhārata-Drōnaparva by Bhāratamu Lakṣmīpatı Paṇḍita.

Incomplete.

**Beginning :**

శ్రీసంశ్రయ మంగళముచేతనున్ను, గౌరీసంగమ విభవముయొక్క పుణ్యాలేఖాసంపత్తిచేతనున్ను భాసితమైన వక్షస్సుచేతనున్ను వామ భాగముచేతనున్ను, ఆసూత్రిత—అంతటామాలోకించిన చిత్రమహిమ లవాడా॥౧॥ హరిహరనాథా॥౨॥

౧, ౨, ౩, ౪ అనిమిషనదీ తనూజుఁడు పోవుటవిని ధృతరాష్ట్రుఁడు సంజ యుని కొడుకు నొద్దకు కొడుకు జయకాంక్ష తన హృదయమందు అం కురించగా బలికెను ॥౫॥

*  *  *  *

గద్య॥ ఇతి శ్రీమదుభయ కవి మిత్రుడు కొమ్మనామాత్యపు త్రుఁడు బుధారాధన విరాజిఅయిన తిక్కన సోమయాజిచేత చెప్పఁబడిన ద్రోణ పర్వంబునందు ప్రథమాశ్వాసము ॥౩౩౯॥

*  *  *  *

**End :**

నతార్తి ప్రతిహననని తాంత ప్రౌఢ, నమ్రదుఃఖనివారణమందు అధిక ప్రౌఢుడా॥౨॥ లీలావినోదాయిత, లీలావినోదముగానున్న భువన పఙ్క్తికి అధిక నిర్వాహకుడా॥౩॥ మోహవ్యతికర మోహపుంజము అనే చీకటియొక్క నాశనమందు దీపమువంటివాడా॥౪॥ ౩౩౭॥ గద్య॥౩౩౮॥

**Colophon :**

ఇతి శ్రీమదుభయకవితాహూరసూరమా లక్ష్మీనృసింహసూరికుమార భారతాన్వయధరకైశోర ప్రభృతి సమారాధిత శ్రీపతి లక్ష్మీపతి ప్రణీతం బైన శ్రీ మహాభారతతూలంకషాఖ్యవ్యాఖ్యానంబునందు ద్రోణపర్వం బున చతుర్థాశ్వాసము ॥

(టి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ద్రోణపర్వమునందలి తొలి నాల్గాశ్వాసములకు మాత్రమిందు వ్యాఖ్యానముగలదు. కర్త భారతము లక్ష్మీపతి పండితుఁడు.

---

**R. No. 815.**

Palm-leaf. Size, 18½ × 1½ inches. Foll. 251. Lines, 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Slightly injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

(*a*) మహాభారతము (నన్నయ).

MAHĀBHĀRATAMU (BY NANNAYA).

Foll.—1–218 B

Same work as that described under R. No. 383.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. అరణ్యపర్వమిందుగలదు. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములల్పములు.

ఇది ఆర్. నె 383 రున వర్ణితమయినదే.

(b) अनर्घराघवम्.

ANARGHARĀGHAVAM.

Foll.—220–251

See Sanskrit part.

---

R. No. 816.

Palm-leaf. Size, 17½ × 1½ inches. Foll. 180. Lines, 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము (నన్నయ).

MAHĀBHĀRATAMU (BY NANNAYA)

Same work as that described under D. No 163

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. ఆది పర్వమాత్రమున్నది వ్రాంతతిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నె 163 రున వర్ణితమయినదే.

గ్రంథాంతమున నీ వ్రాంతగలదు—"క్రోధినామ సంవత్సర పుష్య బ. ౨ సోమవారంసరికి పుణ్యమూర్తుః వెంకయ్య కొమారుడు అచ్చన్న అద్దంకి రామన్న వ్రాశిన ప్రతినున్న ప్రకారం ఆదిపర్వం సంపూర్ణంగా వ్రాసెను."

---

R. No. 817.

Palm-leaf. Size, 17½ × 1½ inches. Foll. 262. Lines, 9 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము (నన్నయ).

MAHĀBHĀRATAMU (BY NANNAYA).

Same work as described under D. Nos. 165 and 166.

(వి-వి.)—

అసమగ్రము. సభారణ్యపర్వము లిందున్నవి. వ్రాంతలిన్నవి. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములుగలవు.

ఇది డి. నెం 165, 166 రులలో వర్ణితమయినదే.

---

R No 818.

**Palm-leaf. Size, 15½ × 1⅝ inches Foll. 187. Lines, 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928

మహాభారతము (నన్నయ)

MAHĀBHĀRATAMU (BY NANNAYA)

Same work as that described under R No. 391.

Incomplete.

(వి-వి.)—

ఆదిపర్వము సమగ్రముగా నున్నది. సభాపర్వ మసమగ్రముగా నున్నది. వ్రాంత లిన్నవిదే. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 391 రున వర్ణితమయినదె.

గ్రంథాంతమం దిట్లున్నది—"పింగళ సం॥ జ్యేష్ఠ శు 4 గురు వారం రోజున రాయవరపు బుచ్చన్న కొమారుడు పేరిరాజు ఆదిపర్వం సంపూర్ణంగా వ్రాసుకునెను"

---

R. No. 819.

**Palm-leaf. Size, 17½ × 1⅝ inches. Foll. 33. Lines, 6 on a page. Mode of writing not good, contains full of mistakes Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928

కాలామృతము (ఆంధ్ర టీకా సహితము).

KĀLĀMRTAMU (WITH TELUGU MEANING).

Begins on fol 7-*b*—

Contains a word—for—word Telugu meaning for the Chapter on house—building in the work known as Kālāmṛtamu. The name of the commentator is Vēdāntācārya.

Incomplete.

**Beginning :**

శ్లో॥ సేవాయాం ప్రభునామ భాదిగణయే ద్భృత్యాఖ్య ధిష్ణ్యాంతత
స్తత్కృత్వాథ చతుర్గుణం ప్రవిభజేచ్ఛైలైశ్చ శిష్టంధనమ్।
తద్వత్పూర్వ విపర్యయాగత మృణంజ్ఞేయం హి రాజ్ఞస్త్విదం
భృత్యస్యైవ తు భృత్యభాదిగణయే దర్థాధికో రాజ్యకృత్.

టీక॥ ప్రభునామ భాది—ప్రభునామ నక్షత్రమాదిగాను భృత్యాఖ్య ధిష్ణ్యాం తతః—భృత్య సేవకునియొక్క ఆఖ్య పేరు చాతను వచ్చిన ధిష్ణ్య నక్షత్రము అంతతః అంత్యమం దుండినట్లుగాను, ఆ ప్రభు నక్షత్రమాదగాను, భృత్య నక్షత్ర పర్యంతం, గణయేత్ లెక్కచాయవలెను, తతః—అనంతర్యాతను తత్—ఆ అయిన లెఖ్ఖను, చతుర్గుణం కృత్వా-నాలుగింట హెచ్చుగుణించంగా వచ్చిన లబ్ధాంశైలైః—పడింటి చాత భాగించగాను, శేషం—మిగిలిన లెఖ్ఖయెంతో అది ధనం ధనము భవతి—అవును, తద్వత్—ఆ ప్రకారంగాను, పూర్వ విపర్యయ—మునపు చెప్పినవానికంటె వత్యాసంచాతను ఆగతం—వచ్చినది, ఋణం ఋణమని జ్ఞేయం—తెలియతగినది, పూర్వ విపర్యయమనంగాను, పూర్వం ప్రభునామ నక్షత్ర మాదిగాను భృత్య నక్షత్రం దనుకా యెంచి నాలుగింట హెచ్చగుణించి యేడింట భాగించగా మిగిలిన శేషం ధనమని చెప్పితిమి, అది భృత్యనామ నక్షత్రం మొదలుగా ప్రభునామ నక్షత్ర పర్యంతం యెంచి, ఆ అయిన లెఖ్ఖ నాలుగింట హెచ్చించి యేడింట పాలుపుచ్చగా మిగిలిన శేషం ఋణము, ఇదం ఈక్రమము రాజ్ఞః రాజార్థం, భృత్యస్యైవతు—భృత్యుని కైతేను, భృత్యభాది, భృత్యుని నామనక్షత్రము మొదలుగాను ప్రభునామ నక్షత్ర పర్యంతం గణయేత్, గణన చాయవలెను; ఆ గణనచేసినలబ్ధం నాలుగింట హెచ్చించి యేడింటపాలు పుచ్చంగా మిగిలిన శేషం ధనము ఆదే విపర్యయంగాను ప్రభునామ నక్షత్ర మాదిగా, భృత్యనక్షత్ర పర్యంతం యెంచి నాలుగింట హెచ్చించి, యేడింటపాలు పుచ్చంగా మిగిలిన శేషం ఋణము అర్థాధికో ధనమధికమైతేను రాజ్యకృద్భవతి—రాజ్యము ఇచ్చేవాడౌను. ౨౩౦

* * * *

**End :**

శీర్షచ్ఛేద మథప్రవాస మభయం ధాన్యం తతో నిర్ధనం
గర్భస్రావమథ శ్రియం గృహపతేర్దద్యాచ్ఛతా యస్సదా
సంగ్రామాఖిల దుర్గశైల నగరప్రాసాద దేవాలయ
క్షేత్రారామ గృహప్రవేశ సమయే జ్ఞేయం హి చక్రద్వయం.

టీక॥ క్రమాత్—వరుసగాను శీర్షే—కలశచక్రంయొక్క శిర స్సునను, ఒక నక్షత్రానకు ఫలం . . . క్షేత్రే నూతనక్షేత్రము మొదటి దర్శనకాలమందున్ను ఆరామ నూతన వన ప్రతిష్ఠాకాలమందున్ను; గృహప్రవేశసమయే—గృహప్రవేశ సమయమందున్ను ఈ పూర్వోక్తకాలములయందు చక్రద్వయం—వృషభచక్ర కలశచక్రాలు రెండున్ను జ్ఞేయం తెలియతగినది ॥౨౮౫॥

ఇది శ్రీ కవితార్కిక సింహాస్య వేదాంతాచార్య కృతిషు కాలామృత ఆంధ్ర వ్యాఖ్యానే వాస్తుప్రకరణం సమాప్తం.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములుగలవు.

కాలామృతమందలి వాస్తు ప్రకరణమునకుఁ దెనుఁగు టీక. కవితార్కిక సింహవేదాంతాచార్యుని కృతియట యీ కాలామృతాంధ్ర వ్యాఖ్యానము. ఈ వేదాంతాచార్యుఁడు సుప్రసిద్ధులగు వేదాంత దేశికులవారు కారేమో! గ్రంథాదిని జ్యోతిషశాస్త్రమునకు సంబంధించిన శ్లోకములు కొన్నింటికి దెనుఁగుటీక వ్రాయఁబడి యున్నది.

---

R No 820.

**Palm-leaf. Size, $16\frac{3}{4} \times 1\frac{3}{8}$ inches. Foll. 252. Lines, 7 on a page. Mode of writing, good but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

**మహాభారతము.**

MAHĀBHĀRATAMU (BY NANNAYA AND TIKKANA).

Same work as that described under D No 163.

Incomplete

(వి-వి.)—

అసమగ్రము ఆది సభాస్వర్గారోహణ పర్వములిందు గలవు. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 163 రున వర్ణితమయినదే.

గ్రంథాదిని—"క్రోధినామసంవత్సర శ్రావణ బహుళ ౧౧ బుధవారం నాడు కామరాజు ఆదిపర్వ వ్రాయ ప్రారంభించెను" అనియు

గ్రంథాంతమున—‘క్రోధి నామ సంవత్సర అశ్వీజ శు 3 శు సరిగా గాడె పేర్రాజు వ్రాశ్ని ప్రతిక్రమానను గాడె కామరాజు ఆది పర్వం సంపూర్ణంగా వ్రాశెను” అనియును గలదు.

---

## R. No 821.

Palm-leaf. Size, 16½ × 1⅞ inches. Foll 213. Lines, 8 on a page. Mode of writing, fair but not free from mistakes Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము (నన్నయ్య).

MAHĀBHĀRATAMU (BY NANNAYA)

Same work as that described under D. No. 163.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. ఆదిపర్వము సమగ్రముగాఁ గలదు. మొదటి యాకు మాత్రము లేదు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 163 రున వర్ణితము.

గ్రంథాంతమున నిట్లున్నది—“స్వభాను నామ సంవత్సర కార్తిక శు ౨ జయవారం వరకు బాలాంత్రపు పేర్రాజు కొమాళ్లు కామరాజు ఆదిపర్వం సంపూర్ణంగా వ్రాసెను.”

---

## R. No. 822.

Palm-leaf. Size, 16 × 1⅞ inches. Foll. 201. Lines, 7 or 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

(*a*) మహాభారతము.

MAHĀBHĀRATAMU (BY TIKKANA).

Begins on fol. 1-*a*—158.

Same work as that described under D. No. 287.

Incomplete.

(వి-వి.)—

ఇందు అశ్వమేధాశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారో హణ పర్వములు సమగ్రముగా నున్నవి. వ్రాంత మంచిదే. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి నెం 287 రుం సరిపోల్పబడినదే.

గ్రంథాంతమున నిట్లుగలదు—"వ్యయ నామ సంవత్సర కార్తిక బహుళ ౧౦ శుక్రవారంవరకు శ్రీరామ భద్రిరాజు కుమాళ్లు వెంకట్రామరాజు కొంతమట్టుంన్ను చోప్పెల్ల అచ్యుతరామయ్య కొంతమట్టున్ను అత్తిలి చిన వెంకన్న కొంతమట్టున్ను దంతులూరి భగవాన్రాజు గారి ప్రతిక్రమానను శ్రీ శీతారామర్పణముగా వ్రాశిరి."

(*b*) భాస్కర రామాయణము (భాస్కర).

BHĀSKARARĀMĀYAṆAMU (BHĀSKARA).

Begins on fol 160-*a*—201-*b*

Incomplete

Same work as that described under D. No 138

(వి-వి.)—

అసమగ్రము. సుందరకాండము మాత్రమున్నది. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 138 రున వరితమయినదే.

---

R. No. 823.

Palm-leaf. Size, 15½ × 1½ inches. Foll. 36. Lines, 7 on a page. Mode of writing fair but not free from mistakes. Slightly injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము.

MAHĀBHĀRATAMU (BY NANNAYA).

Same work as that described under D. No. 205

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. సభాపర్వ మసమగ్రముగా గలదు. ప్రారంభమునఁ గొన్ని యాకులు లేవు. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 205 రున సరిపోల్చబడినదే.

## R. No 824.

**Palm-leaf. Size, 17½ × 1½ inches. Foll 288 Lines, 7 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

**మహాభారతము.**

MAHĀ BHĀRATAMU (BY NANNAYA AND TIKKANA).

Same work as that described under D. Nos. 187 and 262.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. ఆదిపర్వము, శల్యసౌప్తిక స్త్రీ పర్వములు ఇందు గలవు. వ్రాత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 187, 262 రులలో వర్ణింపబడినదే.

---

## R No 825.

**Palm-leaf. Size, 16½ × 1⅝ inches. Foll. 272. Lines, 7 or 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

ఉత్తర రామాయణము (కంకంటి పాపరాజు).

UTTARARĀMĀYAṆAMU (BY KAṄKANṬI PĀPARĀJU).

Same work as that described under R No 137.

Complete.

(వి-వి )—

సమగ్రము వ్రాత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 137 రున వర్ణితమయినదే.

గ్రంథాంతమందీ వ్రాత గలదు—"శార్వరి నామ సంవత్సర ఆషాఢ శు ౯ బుధవారమువరకు చెలికాని నరసయ్యగారు ఉత్తర రామాయణం వ్రాయడమైనది."

R. No. 826.

Palm-leaf. Size, 18 × 1¾ inches. Foll. 179. Lines, 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928

మహాభారతకూలంకష (శాంతి పర్వము).

MAHĀBHĀRATAKŪLAṄKAṢA (ŚĀNTIPARVA)

This is a commentary from the second āśvāsa to the fifth āśvāsa of Mahābhārata-Śāntiparva The author is Bhāratamu Lakshmīpati Paṇḍita

Incomplete

**Beginning :**

శ్రీ శుచితా ధృతికరణ క
లాశాంత కటాక్షలీల లౌల్యరహిత లో
లాశక్తి త్రయ సమయు
క్తాశోభిత రూపహేల హరిహరనాథా।

వ్యా॥ శ్రీ శుచితయోః సంపన్నియమయోః ధృతికరణాత్మికాధారణ దానాత్మికా కలా విద్యాయస్యేతి । శ్రీ శుచితాధృతి కరణకలా॥౧॥ శంసుఖం అంతే యస్యాస్సా కటాక్షలీలా యస్యేతి శాంత కటాక్షలీల ॥౨॥ లౌల్యరహిత లోలా, అలోల లోలా ॥౩॥ ఆవరణ విక్షేప సంహారాత్మికం, ఇచ్ఛాజ్ఞాన క్రియాత్మకంవా, శక్తిత్రయం సమం యుగపత్ యునక్తీతి శక్తిత్రయ సమయుక్ తస్యభావస్తత్తా తయా ఆసమంతాచ్ఛోభిత రూపహేలా రూపక్రీడా యస్యేతి శక్తిత్రయ సమయుక్తా శోభిత రూపహేల ॥౪॥ యీ నాలుగున్ను లాంతాలు ।౧। దేవా, హరిహర నాథా। ఒడయులరు, కర్తలు, సలుపుచు అనే చువర్ణము వర్తమానార్థము గనుక, వికల్పసంధి గనుక పరమందు కుంతీ, గుంతీ అనిన్ని వుండవచ్చును.

**End:**

క॥ విను విష్ణుని సంస్పర్శం
బుననప్పుడు సూనె కసెటువోయినమతినిం
గనుటయు శాంతింబొందుట
యును గురువర కలిగె వ్రతునుల్లంబునకున్

వ్యా॥ వినువజ్రాగ్రమందువున్న విష్ణుస్పర్శచేత, కసటువోయిన చిత్తమాలిన్యము పోకావుండగా వ్రతుని మనస్సుకు భగవద్దర్శనమున్ను, శాంతిన్ని కలిగెను ౪౨౯, ౪౩౦.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు గలవు.

ఇందు శాంతిపర్వపు ద్వితీయాశ్వాసమునుండి పంచమాశ్వాసము వఱకుఁగల భాగమునకే వ్యాఖ్యగలదు. కర్త భారతము లక్ష్మీపతి పండితుఁడు.

---

## R. No. 827.

**Palm-leaf. Size, 18 × 1⅝ inches. Foll. 250. Lines, 9 or 10 on a page. Mode of writing, fair but not free from mistakes. Good.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

(*a*) విష్ణు పురాణము.

VIṢṆUPURĀṆAMU (BY VENNELAKANṬI SŪRANA).

Foll. 1-*a*—142-*b*.

Same work as that described under D No. 311 of Descriptive Catalogue, Vol I

Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు లేవు.

ఇది డి. నెం 311 రున వర్ణితమయినదే (కర్త వెన్నెలకంటి సూర నార్యుఁడు).

(*b*) వరాహ పురాణము.

VARĀHAPURĀṆAMU (BY HARI BHAṬṬA).

**Foll 143 *a* —201 *b*.**

**Same work as that described under R. No. 411.**

**Complete.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు లేవు.

ఇది ఆర్. నెం 411 రున వర్ణితమయినదే. (కర్త హరిభట్టు.)

(c) మత్స్య పురాణము.

**MATSYAPURĀṆAMU (BY HARI BHAṬṬA).**

Foll. 202-*a*—250 *a*

Same work as that described under R No 525 of Triennial Catalogue, Vol III.

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుంచి రైదవ యాశ్వాసమునం గొంతవఱకు గలదు. వ్రాంత తిన్నది. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 525 రున వర్ణితమయినదే. (కర్త హరి భట్టు.)

గ్రంథాంతమున నీవ్రాంతగలదు —" రుధిరోద్గారి సం॥ ఆషాఢ బ ౭ ఐ వరుకు మహారాజశ్రీ రాజారావు కుమార మహీపతిరావు బహదరు గారికి రేమెర్ల పుస్తాంకయ్యగారు యథామాత్రుకగా విష్ణు పురాణం వరాహ పురాణం మత్స్యపురాణములున్ను వ్రాశి శ్రీరామ చంద్రార్పణగా దాఖలు చేసిరి."

---

R No 828.

Palm-leaf. Size, 14¾ × 1¼ inches Foll. 191. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes Good

Presented by the Maharaja of Pithapuram in the year 1926

(*a*) రుక్మాంగద చరిత్రము.

**RUKMĀṄGADACARITRAMU**

Foll 1-*a*—127-*a*

Same work as that described under R No. 282-*a*.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్నదే. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 282 రున వర్ణితమయినదే.

గ్రంథాంతమందీ వ్రాంతగలదు.

" పంటవలంతిలోపల నుప్పలాన్వయ
కలశోదధికి హిమకరుడునైన
లింగయ్యనాముడనంగ జనకుని పాద
భక్తుని తనయుడై బరగుచున్న
రామయార్యునకును రమణి వెంకమ్మకు
వనజాక్షు కరుణను వరకుమారుఁ
డైన వెంకన్నాఖ్యుఁడ మహేంద్రవంద్యుని
శ్రీపాద భక్తుఁడై చెలగువాని
కతులకొండూడ వంశదుగ్ధాబ్ధిచంద్రు
డగుశటాగయ్య పుత్రుఁడనైన గోప
నాఖ్యుఁడ లిఖించి విమల రుక్మాంగదక్షి
తీశ చరితంబు నొసగితి మీశకరుణ "

యీశ్వర సం॥ శ్రావణ బ ౧౩ బు॥ వరుక ప్రతిలో వున్న ప్రకారం పంచమాశ్వాసము సంపూర్ణము."

(b) సోమవార మాహాత్మ్యము.

SŌMAVĀRAMĀHĀTMYAMU.

**Foll.—128-*a*—191-*a***

**A work on Śaivism dealing with the greatness of a particular ceremony to be performed on Monday. Sanyāsikavi of Amalapuram is the Author.**

**Compleer.**

**Beginning :**

శ్రీమత్తారగమహీధరాగ్రమున లక్ష్మీనాథవాణీశసు
త్రామాదుల్గొలువంగ రత్నమయ సౌధశ్రేష్ఠ మందంబికా
భామారత్నము గూడి లోకములు శుంభత్ప్రీతిమం బ్రోచుయా
సోమార్ధాంశకిరీటి గోల్పెడ సదాస్తోక ప్రియంబొప్పగన్.

* * * *

క. అని సర్వ దేవతాప్రా
ర్థనమును గురు సన్నుతియు తగసత్కవివ
ర్ణనముంగుక విశిరసత్కృతి
యును జేసి మదీయవంశ మొగివర్ణింతున్.
కుతలమున ఖ్యాతిగాంచిన కుంభకార
వంశమం దమలాపురాన్వయ పవిత్రుఁ
డలఘు చారిత్రుఁడురు శౌర్యుఁడద్రిరాజు

ధైర్యుఁడు దయించె శ్రీమల్ల నార్యుఁడన
అతనికి సంకమాంబకు
శాతోదరికిం జనించె సమథకసుగుణా
న్వితుఁడు భూరియశోవి
ఖ్యాతుఁడు నారాయణాఖ్యుఁడన నిద్ధాత్రిన్.

సీ. సుందరంబునను పురందరాత్మజుమించి
ఘనశౌర్యమున మృగేంద్రుని హసించి

* * * *

క. ఆ నారాయణునకుల
క్ష్మీనారీ రత్నమునకు శ్రీకరతకవి
జ్ఞానులు మల్లనకాశన
నానిరువురు జననమైరి నయగుణహితులై.

వ. అందగ్రజుఁడు—

ఉ. మేరుసమాన ధీరుఁడు యమేయగుణాకరుఁడర్థికోటిమం
దారుఁడు శాంతమూర్తి హిమధామసుధారసహారహీరడిం
డీరతుషారసారస పటీర నిభామలకీర్తివంశవి
స్తారుఁడు ధర్మమార్గను విచారుఁడు మల్లయనాముఁడున్నతిన్.

గీ. అతని నిజపత్ని . . . కరుణావలంబ
శాంకరీభాస మానాంఘ్రిపంకజాత
సమదరోలంబ మకృత్పూత శైలశంబ
భద్రగుణ నికురుంబ సుభద్రికాంబ.

గీ. ఆసుభద్రికాంబ యనఁగఁలోఁ బ్రఖ్యాతి
గాంచి విభుసుచరణ కమలయుగము
మనమునందు నిల్పి యనుగమంబొనరించి
దివికినేగె . . . నంచితముగ.

సీ. స్ఫురదమలాపురీ వరవంశదుగ్ధర
త్నాకరరాకాశశాంకరుండు

* * * *

ననగఁజెలఁగెను నిద్ధరనభువిదూరి
భవ్యసన్మార్గ సంచారి పద్మలోచ

నాపటలశూగ్స్రకారి పరోపకారి
యతులగుణహారి శ్రీకాశ నాఖ్యసూరి.

గీ. అతని జాయాశిరోమణి యతివితరణ
బహుళశక్తరశాంత జితపృథ్వి పరమసాధ్వి
సలలిత కృపావిలోకి శశ్వద్విలోకి
కలితసుగుణావలంబ శ్రీగంగమాంబ.

వ. ఆకాశనాఖ్యుండను బుధేంద్రోత్తమునకు గంగమాంబకు వనితాలలామకు సకల సజ్జనవిధేయులగు పుత్రత్రయంబును సువాసినీతిలకంబులగు పుత్రికాచతుష్టయంబును జనియించి రందగ్రజుండు.

క. పన్నగరాజ విభూషణ
మున్నత పూజావిధానుఁడురు గుణగణసం
పన్నుఁడు మహితాకారుఁడు
చిన్నయ్య సమాఖ్యుఁడనగ క్షితిలో వెలసెన్.

వ. మధ్యముండు

క. సోమాభి ధానుఁడలరెను
సామాది మహాగుణాళి చాతుర్యుండు
ద్ధాముఁడు సంప్రాప్తాఖిల
కాముఁడు నారీజనౌఘ కాముఁడనంగన్

వ. కనిష్ఠుండు—

క. మనమలరగ మజ్జననీ
జనకులు సంతసముతోడ సంరక్షింపన్
ఘనముగ నేనంతంతకు
దనరితి తగశుక్లపక్ష తారేశుగతిన్

* * * *

గీ. ఇందు శేఖర పాదారవిందనవమ
రందపానల సన్మధువ్రతుఁడకన్న
మాకళత్రుండ భాస్వద్వివేకయుతుఁడ
మహితసన్యాసి యనెడు నామంబువాఁడ.

క. పంచాస్త్ర వినాశునకున్
చంచత్కమలాప్త కోటి సంకాశునకున్
పంచితదనుజేశునకున్
పంచముఖేశునకు విగత భవపాశునకున్.

వ. అర్పణంబుగా నా యొనర్పంబూనిన సోమవాసర మహాత్మ్యం
బునకుఁ గథాభిధానం బెట్టిదనిన.

**End :**

సుమశరనిభవేషా సూరివ్యాప్తప్రభూషా
సముచితమృదుభాషా సర్పరాజేంద్రభూషా
ప్రమథఘటదయాతోషా భక్తలోకైకపోషా
దమిత సకలదోషా దైత్యవాణాలశేషా.

**Colophon :**

ఇది శ్రీమత్పంచ ముఖ్యేశ్వర చరణారవింద నిష్యందమాన మరంద
బిందుసందోహపానానంద సుందరేందిందిరాకార శ్రీమదమలాపురాన్వ
యవిస్తార శ్రీ కాశనార్య ప్రియకుమార యనవరత సముంచితగుణోదా
ర సకల విద్వత్కవి జనవిధేయ సన్యాసి నామధేయ ప్రణీతంబైన
సోమవాసర మాహాత్మ్యంబను శైవకథయందుఁ దృతీయాశ్వాసము.
(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ
పాతములు లేవు.

శైవ విషయము. సోమవార వ్రత మాహాత్మ్య మిందు వర్ణిత
ము. కర్త అమలాపురపు సన్యాసి కవి. విశేషములకు దాహృత
గ్రంథ భాగముఁ జూచునది.

గ్రంథాంతమున నిట్లుగలదు—"బహుధాన్య సంవత్సర చైత్ర
బహుళ ౧౩ సోమవారం వరకు ప్రతిలోవున్న ప్రకారం ఉప్పల వెంకన్న
గారికి కొండాడ గోపన్న యీ సోమవాసర మాహాత్మ్యమను గ్రంథము
మూడు ఆశ్వాసములు సంపూర్ణంగా వ్రాశియిచ్చెను."

---

R. No. 829.

Palm-leaf. Size, 14½ × 1½ inches. Foll. 41. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Slightly injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1926.

జ్యోతిష రత్నాకరము.

## JYŌTIṢA RATNĀKARAMU (BY HONNAYA).

This is the same work as that described under R. No. 266 and contains fuller details about the work and the author.

Incomplete.

**Beginning :**

కారుణ్యంబున నెల్లలోకములకుఁ గల్యాణముం జేయుచుఁ
ధీరోదారతనుండు కృష్ణుఁడు సిరుల్ దీర్ఘాయువున్నిచ్చున
త్యాగాఢంబుగ రంగరాజు ఘనుఁడన్నామాత్యసింహాద్రికిఁ ?
కలశాంభోనిధి మూర్తిపట్టి త్రిజగత్కల్యాణి రుద్రాణిగా
దిలిచుట్టంబు హిమాంశుతోడు హరికిం దేవి . . . భారతీ
లలనాసేవిత పాదపద్మయుగయౌ లక్ష్మీసరోజాక్షి శ్రీ
లలరన్నిచ్చును రంగరాజు ఘనుడన్నామాత్య సింహాద్రికిన్.

* * * *

సరవి తోశబ్దశాసనుని నన్నయభట్టు
సుగుణాఢ్యుదిక్కన సోమయాజి
లలిత శ్రీరామవరలబ్ధ బెమ్మెర
పోతనమితి సత్కవి శ్రీనాథసుకవి
ముక్కంటిసూనులే ములవాడభీమన
భాషావిచక్షణు భాస్కరేంద్రు
సుభగు నెర్రాప్రెగ్గ సోమనాథునిదండి
రామాయణశ్రేష్ఠు రంగనాథు
గారనామాత్యు భైరవు గాచుబోచు

ఘనులైన యాదికవుల
మహితపండితులగు వర్తమానకవుల
సంతతంబును సద్వాక్య సరణిచేత
గోరినుతియింతు మత్కృతి కొనలుసాగ.

* * * *

క. ధాతముఖోద్భవమయ్యెను
జాతుర్వేదములు నారుశాస్త్రములందుఁ
జాతుర్లక్షగ్రంథము
జ్యోతిష శాస్త్రంబునందు సుకవివరేణ్యుల్.

క. వనధిమణులు మాలికచే
సినక్రియనే సోమసూర్య సిద్ధాంతములో
ఘనసారం బెల్లనుగూ
ర్చనుమతితో రత్నమాల యనిరి మునీంద్రుల్.

క. పారీణత తమకొలదిని
బారాహమునం గార్గ్యవాసిష్ఠమునన్
వారు రచించినక్రియనే
నారూఢిన్ పంచకావ్య మలగ రచింతున్.

చ. శుభకవితావిశేషగుణ శోభితుడన్ జరిగొండరామయ
ప్రభునకుఁ జెన్నమాంబకును భవ్యసుపుత్రుడ వెంకన్ననాఖ్యుడన్
సభికుడ యా.. విశ్రమునిశాఖిని జ్యోతిషకావ్యసంతయున్
రభసముతో నొనర్చెను గురుప్రసులకును మెప్పు జెప్పెదన్ ?.

*   *   *   *

సీ. భూచక్రమునగల్గు పుణ్యతీర్థశ్రేణి
సలిపెడు నాతీర్థసారమతఁడు
విష్ణుపాదామృత విషధికి నావయై
యానందమునఁ దేలలాఁడువాఁడు
అజ్ఞానకలుష మహాంధకారము బాపి
సుజ్ఞానదీపిక జూపునతఁడు
ఘనతతో వేదమార్గప్రతిష్ఠాపనా
చార్యుఁడై షణ్మతంబుల కాదినాథుడతఁడు (?)
అతఁడు దాసులకివాపర మర్థినొసఁగు
లక్ష్మణోత్తముండు తిర్మలలక్ష్మణార్యు
డమితపుణ్యుని సంప్రదాయకులలోన
నలరె గురుభక్తిచేత సింహాద్రివరుఁడు

*   *   *   *

మ. కరుణన్ వారధి వాచకత్వమున నాకౌండగాధీశు భా
సుర కాంతిం జలజాతశత్రు విభవస్ఫూర్తిన్ శచీనాయకున్
వరదానంబున గర్ణు భూతిశివు లావణ్యంబునన్ బుష్పచా
పరయాన్ మించిన రంగరాజఘనుఁడన్నామాత్యసింహాద్రికిన్.

సీ. మూర్ధాభిషిక్తుడై ముదమునసన్మంత్రి
    బంధువర్గంబులు బండితులును
దొరలుసామంతులు దుర్గాధిపతులును
    హితులు మాన్యులు పురోహితులు సుతులు
కవిగాయకులు వారకాంతలు సరసార్థి
    భటసమూహము లెల్ల బలసికొలువ
మంగళశృంగార సంగీతనటనల
    శోభిల్లగాభూమి సురలచేత
వేదశాస్త్రపురాణముల్ వినుచునుండి
మానితాస్థానమందిరాసీనుడగుచు
రంగరాజాన్వయాంభోధి రాజసముడు
మంత్రియన్నయసింహాద్రి మానఘనుడు.

క. ఒకనాడు నన్ను రావిం
చకలంకంబైనప్రేమనర్థించెదదో
యకుమీనావచనము కౌ
తుకమున నీవిపుడుసేయదొరకొన్నకృతిన్.

*        *        *        *

సతర్కవిత్వంబున సభలవిద్వత్కవుల్
    వినుతింప నిమ్మహి వెలసినావు
సకలపురాణాది సంహితార్థంబులు
    అర్థనిర్ణయముగా నెరసినావు
శైవరహస్యాది సారస్యవార్ధిలో
    నానందముగనోలలాడినావు
ఎనముతటాకంబు లొనరించి కృతులచే
    నియత సద్ధర్మంబుల నిలిపినావు
నీవుమాకుహితుండవు నిఖిలకావ్య
సముదయంబులు రచియింప సరసమతివి
రమ్యచారిత్ర చరికొండ రామనార్య
మంత్రిసత్పుత్ర చెన్నయ మహితచరిత.

*        *        *        *

సకలశాస్త్రములనీగతి జెప్పబూని
యున్నజ్యోతిషశాస్త్రంబు చెన్నమీర

సకలసత్కళావిజాతంబుసన్నుతింప
యనఘ సేయుము నా పేరనంకితముగ.

వ. అవనిబహుమాన పురస్సరంబుగా కాంచనాభరణ వస్తువాహన కర్పూర తాంబూల దివ్యాంబరాది విశేషచయంబులొసంగి పి ఢౌకలిపిన యమ్మంత్రిచూడామణి వచోమాధుర్యంబులకు సంతసిల్లి యేను మహాప్రసాదంబని యంగీకరించి

క. అనికృతిపతిహారితసగో
త్రుని మంత్రీశ్వరుని మేరు ధీరుని సింహా
ద్రిని జేసి యతనివంశము
తనరగవర్ణింతు శాశ్వతంబై వెలయన్.

* * * *

క. శ్రీరమణుని నాభీసర
సీరుహభవుఁ డుద్భవించి సృష్టీశ్వరుఁడౌ
వారిజగర్భుని యంశమ
ధారుణిలో హారితుఁడనగ తగుచుసుప్రఖ్యాతిన్.
ఆహారితుని సత్కులమున
శ్రీహరి చరణారవింద సేవకుఁడమితో
త్సాహుఁడిల రంగరాజను
బాహుబలాఢ్యుండు పుట్టి ప్రస్తుతికెక్కెన్.
నాలుగు వేదంబులలో
మేలుయజుశ్శాఖయందు మించెనుకీర్తిన్
జాలెడు హారితసగోత్రవి
శాలుండను రంగమంత్రి సన్నుతి వెలసెన్.

గీ. అందురంగరాజు వంశంబునందును
దానసత్యరూప ధైర్యములను
కర్ణహరిశ్చంద్ర కందర్పమేరుల
బోల్పనుద్భవించె బొమ్మమంత్రి.
అమరగ బొమ్మరాజునకు నాత్మజుఁడైయుదయించె నేర్పునన్
కమలజుఁడంగవైఖరిని గాయజుఁ డాశ్రితబంధుపోషణన్
గుముదహితున్ మహాధృతిని గోత్రవరేణ్యుని మించి ధాత్రిలో
నమితగుణాఢ్యుడన్న సచివాగ్రణి సత్కవికల్పభూజమై.

వ. అట్టియన్న మంత్రికర్ధాంగియైన తిమ్మమాంబ గర్భరత్నాకరంబందు

సరసుడు రంగరాజు కులసాగరచంద్రుడు తిప్పమంత్రికిన్
తరుణీశిరోవతంసమును ధర్మిణిబోలిన తిమ్మమాంబకున్
వరయశులర్కతేజులురు వైభవరూపవచోదయానిధుల్
పరువడి బుట్టిరైదుగురు ప్రస్తుతికెక్కిన పుత్రరత్నముల్.
పాండురాజుకూర్మినుద్భవములైన
పాండవులబోలి దానసంపదలయందు
పంచమందారములతోడ ప్రతిభవించి
రైదుగురు వెలసిరందులో నగ్రజుండు.
అతులితకీర్తివంతుడు గుణాఢ్యుడు తిప్పయ తిమ్మమాంబకున్
సుతుడగు రామమంత్రి మణిశోభితలీలల నెన్నమించెనా
శతధృతిచంద్రశేఖర సురశాఖిచతుర్భుజ పుష్పబాణులన్
వితతవచఃకళావిభవ విశ్రుతదానరమాంగవైఖరిన్.
గుణమణిరామమంత్రికిని గూర్మిసోదరుడైనయట్టిల
క్ష్మణునశేషంబునర్థులకు గర్ణునరీతి నొసంగుమత్తవా
రణతురగాంబర ప్రకట రత్నవిభూషణకాంచనాదులన్
ప్రణుతియొనర్ప గావశమె బ్రహ్మకునైనను వానిచర్యలన్.
అట్టిలక్ష్మణమంత్రికి ననుజుడైన
రమణఘనుడైనమాచయామాత్యవరుడు
భువినియర్థులకును కల్పభూరుహంబు
పగిదివికసిల్లె వితరణ భాగ్యములను.
తనరినగంగరాజు కులధన్యునితిప్పయమంత్రినందనున్
అనిమిషరాజవైభవుని నబ్ధిగభీరుని నీతికోవిదున్
దినకరతేజు మేరు నగధీరుని సంతతబంధుపోషణున్
అనిశమునన్నయప్రభుని నాదిమదాతనియెంతురిమ్మహిన్.
ఇందుసమకాంతియుతునకు
బృందారక సేవకునకు పృథుతరమతికిన్
కందర్పతులితరేఖా
సుందరు సింహాద్రిమంత్రి చూడామణికిన్.

* * * *

భామామనోహరునకును
కామితఫలదాయకునకు ఘనబాహాబలో
ద్దామునకు చిరతరాయుః
క్షేమునకును రంగరాజ సింహాద్రికిని.

అభ్యుదయ పరంపరాభివృద్ధియు నిష్టార్థసిద్ధియును గా నారచియింపఁ బూనిన జ్యోతిషరత్నాకరంబను మహాప్రబంధంబునకుం బ్రారంభం బెట్టితిని.

**End :**

ఇట్టి గ్రహంబులు దమలో తమకు వేధలు లేకుండినను . . లంబులిత్తురనిన గార్గ్యుండిట్లనియె నే యేగ్రహంబు లెకకడెకకడనుండిన వేధంబునని సర్వశిష్యులకు చెప్పిన వామవేధ ప్రకారంబవధరింపుము.

(వి-వి.)—

అసమగ్రము. మూడాశ్వాసములున్నవి. వ్రాఁతతిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములుగలవు.

ఇది ఆర్. నెం 266 దున వర్ణింపఁబడినదే కాని కృతికర్తృవంశాదిక మిందు సరిగానున్నది. (కర్త పేరున్నాయి)

---

R. No 830.

**Palm-leaf. Size, 16½ × 1½ inches. Foll. 87. Lines, 7 or 8 on a page. Mode of writing, good but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

భోజరాజు కథలు.

BHŌJARĀJUKATHALU

Same work as that described under R. No. 356.
Author is not known.
Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యగ్రంథ పాతములు గలవు.

ఇది ఆర్. నెం 356 దున వర్ణింపఁబడినదే.

గ్రంథాంతమున నిట్లున్నది— "దుందుభినామ సం॥ మాఘ శు ౧౦ లవరకు భోజరాజ చరిత్రంబను కథలు సర్వంబ్బును సంపూర్ణంగ్గా కామరాజు గడ్డ గోపరాజు ప్రతినివుంన్న క్రమానను పరిశి చెన్నయ్య సంపూర్ణంగా వ్రాశెను."

---

R. No 831.

**Palm-leaf. Size, 16½ × 1⅛ inches. Foll. 130. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Slightly injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928

హరిశ్చంద్ర నలోపాఖ్యానము (సటీకము).

HARIŚCANDRA NALŌPĀKHYĀNAMU (WITH MEANING) (BY RĀMARĀJABHŪṢANA)

Same work as that described under **R.** No 181 of Triennial Catalogue, Vol II

Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతిన్నది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు గలవు.

ఇది ఆర్. నెం 181 రున వర్ణితమయినదే (కర్త రామరాజ భూషణుఁడు.)

గ్రంథాంతమున నిట్లుగలదు:—"విశ్వావసు సంవత్సర జ్యేష్ఠ బ. ౧౦ లు బుకరపట్నం నరసప్ప కొమారుండు యర్రయ వ్రాశ్ని హరిశ్చంద్ర నలోపాఖ్యానం సంపూర్ణం."

---

R. No. 832.

**Palm-leaf Size, 16 × 1⅝ inches. Foll. 44. Lines, 10 on a page. Mode of writing, good and free from mistakes. Slightly injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

సాత్విక బ్రహ్మవిద్యావిలాసము.

SĀTVIKA BRAHMAVIDYĀVILĀSAMU

Same work as that described under R No. 182 of Triennial Catalogue, Vol. II.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములెక్కు లేవు.

ఇది ఆర్. నెం 182 రున వర్ణితమయినదే.

---

R. No. 833.

**Palm-leaf. Size, 17½ × 1¼ inches. Foll. 280. Lines, 6 or 8 on a page. Mode of writing, good but not free from mistakes. Very much injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము.

MAHĀBHĀRATAMU (BY TIKKANA)

Same work as that described under R. Nos 375 and 390 of Triennial Catalogue, Vol III.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. విరాట శల్యోద్యోగ సభా పర్వములున్నవి. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లనల్పములు

ఇది ఆర్. నెం 375, 390 రులలో వర్ణిత మయినదే.

---

R No. 834.

**Palm-leaf. Size, 18 × 1¼ inches. Foll. 157. Lines, 7 on a page. Mode of writing, fair, but not free from mistakes. Much injured**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము.

MAHĀBHĀRATAMU (BY TIKKANA)

Same work as that described under R. No. 382 of the Triennial Catalogue, Vol. III.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. అనుశాసనిక పర్వమొక్కటే యిందున్నది. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతము లనల్పములు.

ఇది ఆర్. నెం 382 రున వర్ణితమయినదే.

గ్రంథాంతమున నిట్లున్నది:—"రౌద్రి సం॥ కార్తిక శుద్ధ ౧౩ గు సరికి అతుకూరి తమ్మిరాజుగారు వ్రాశిన ప్రతిని ధర్మపురి వెన్నరంగము పొన్న శ్రీ పర్వము శాంతిపర్వము యానుశాసనికపర్వము మూడాశ్వాసం వ్రాశి పుస్తకముగాక యీపుస్తకంలో రెండు ఆశ్వాసాలు సంపూర్ణవంగాను శ్రీరామార్పణంగా వ్రాసెను."

---

R No 835.

**Palm-leaf. Size, 16 × 1½ inches Foll. 6. Lines, 5 on a page Mode of writing, good and almost free from mistakes. Injured.**

**Presented by the Maharaja of Pithapuram in the year 1928.**

స్వప్నాధ్యాయము.

SVAPNĀDHYĀYAMU

Deals with the effects of certain kinds of dreams The author is Narahari Kāmēśvara Kavi

Complete

**Beginning :**

శా. శ్రీవాక్పర్వతజేశ్వరాంబుజహిత శ్రీ విష్ణునాథాదులన్
భావంబందున నిల్పి సత్కవుల శుంభద్భక్తిచే నెంచి గౌ
రీవాణీందిరలన్ భజించి విబుధశ్రేణిం దగన్వేడి స
ద్భావున్మద్గురు బ్రస్తుతించి ప్రమదోద్యద్భీ విలాసాఢ్యనై.

క. నారదునకుం గడుప్రీతిని
వారిజజుడు దెలిపినట్టి స్వప్నాధ్యాయం
బారూఢిగ తెనుఁగున నే
నేరుచుగతి కవిత జెప్పి నిశ్చలమతితోన్.

గీ. అనఘునకు జానకీమనోహరునకబ్ధి
బంధనునకు ఖగేంద్రజ పంక్తివదన ?
ముఖ్యదుష్టాపహారునక మోఘునకును
రామమూర్తికి వేడ్కనర్పణ మొనర్తు.

గీ. మండరామచంద్ర పండితాత్మజు . .
. . . . . . సదాజనములు
నరహరియని పిల్వఁబరగి రచించితి
నీకథావిధాన మెట్టిదనిన.

సీ. నారదుం డొకనాఁడు సారసగర్భుని
కొలువున కేగి యాత్ముద్రణతి
తగనుతుల్ గావించి తండ్రియో పద్మజ
ఁగతిలోగల యట్టి జనములకును
నిద్రాంతరములనేకతర స్వప్న
ములగు తత్ఫలములు మొగి శుభాశు
భములు తత్పరిమాణ ఫలములు వినవేడు
కయ్యె స్పష్టముగ నా కానతియ్య
వలయుననన విధి ముదమంది వత్స సావ
ధానబుద్ధిని వినుము భూతలమునందు
గలజనుల స్వప్నముల ఫలాఫలము లెల్ల
తేటపడ జెప్పెదను నీకు ధీసమేత.

* * * *

**End :**

గీ. స్వప్నమైనంత మేల్కాంచి శౌచవిధులు
దీర్చి శుచియయి తాను నిద్రింపమాని
వేఁగుటయెకోరి యుదయమావేళ పుష్ప
ములు గొనుచు నేగి గురుల వృద్ధులను గాంచి

గీ. తగనతులొనర్చి ప్రాఙ్ముఖుఁడగుచు తనకు
నైన స్వప్నంబువారి కాద్యంతముగను
మాటిమాటికి దెల్పుచు మహితతత్ప్ర
సాదలబ్ధుఁడై యింటికి జనగవలయు

* * * *

**Colophon :**

గద్య - ఇది శ్రీ మద్రామచంద్రకరుణాకటాక్ష లబ్ధ కవిత్వవైభవ భారద్వాజస గోత్రపవిత్ర నాండవంశపయః పారావారరాకా నిశాకర నృసింహార్య పౌత్ర రామచంద్రపండిత పుత్ర సకల సుకవిజన విధేయ నరహరి కామేశ్వర నామధేయ ప్రణీతంబైన స్వప్నాధ్యాయంబునందు సర్వంబునే కాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

వాతపిత్తకఫ జనితములయిన స్వప్నములుగాక తదితరములయిన స్వప్నములకు శుభాశుభ ఫలములిందు ప్రతిపాదితములు. కర్త నరహరి కామేశ్వరకవి. రామచంద్రపండితుఁడితనికి దండ్రి. భారద్వాజస గోత్రుఁడు—

గ్రంథాంతమున నిట్లుగలదు.

“ కాళయుక్తి సం॥ మార్గశిర శు॥ భృగువారం వరుస వరహాగిరి కోదండ్రావు పంతులుగారికి అకుల జగన్నాయకులు స్వప్నాధ్యాయం శ్రీరాముల కటాక్షంవల్లను సంపూర్ణంగా వ్రాశియిచ్చెను.”

---

## R No 836.

**Palm-leaf. Size, 13½ × 1½ inches. Foll. 28. Lines, 7 on a page. Mode of writing, fair but not free from mistakes. Good.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

చాటు పద్యములు.

CĀṬU PADYAMULU

A collection of verses taken from different śatakas

Incomplete

**Beginning :**

సీ. శ్రీ కరలీల రాజిల్లువక్షమువాఁడు
దండైనమణి కిరీటంబువాఁడు
పుండరీకయుగంబు బోలు కన్నులవాఁడు
సలలిత మందహాసంబువాఁడు
ముకురసమానరుమంజు ముత్యంబుగలవాఁడు
వలనొప్పపసిడి దువ్వలువవాఁడు
నీలమేఘముకాంతి బోలుదేహమువాఁడు
రమణీయకంఠ హారములవాఁడు
నన్నువలపించి బాసలునాడజేసి
నేఁడు రాఁడాయె నేమమ్మ నీటుకాదు
కొమ్మనీవేగ॥ . . . . . . . .

* * * *

సీ. ప్రాణేశ నినుబాసి ప్రాణంబులరయగ
నిముసమైనను మేననిలువదనుము

నిలచినగాని నీ నెమ్మోము జూడక
తిలకింపమదిజాలి దీరదనుము
జాలిదీరినగాని సదయునీమేనుసో
కక మోహావారిధి గడువవనుము
గడువనీదినగాని కదలినీశోరతి
సెలుపక పది జాలిదీరదనుము.
వెలది నేనాడు పగిదిగా విభునితోడ
వేయువిధముల పలుమాట విన్నవించి
కొమ్మనీవేగ శ్రీగోలుగొండనున్న
భావనారాయణుని దేవె భాసురాంగి.

* * * *

**End :**

సీ. చిలుకలకొలికిరా చిత్తజములికిరా
పసిడిసెలాకరా పంకజాక్షి
తళుకుటద్దంబురా తొలకరిమెరుగురా
కులుకుమిఠారిరా జలజగంధి
గజనిమ్మపండురా కలు . . . . .
. . . . . . . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాతఁ తిన్ననిది. తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు.

కొన్ని శతకములనుండి యేర్చికూర్చబడిన పద్యములును ఎవరెవరివో చాటు పద్యములు నిందు గలవు.

---

R No 837.

**Palm-leaf.** Size, 17¼ × 1⅜ inches. Foll. 64. Lines, 10 on a page. Mode of writing, not good and not free from mistakes. Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

द्वयश्लोकी व्याख्या.

(a) DVAYAŚLŌKĪ VYĀKHYĀ.

Foll 1-*a*—3-*a*

See the Sanskrit part

ప్రమేయశేఖరం.

(b) PRAMĒYA ŚĒKHARAM

Foll. 3-*b*—4-*a*.

(c) వైష్ణవ విషయము.

VAIṢṆAVA VIṢAYAMU.

Foll 4-*b*—12-*b*.

Explains the nature and means of attaining Mōkṣa (final liberation from worldly existence) according to Vaiṣṇavism. It is probably a Telugu rendering of a Tamil work

Complete.

**Beginning :**

పెద్దలు అనతిచ్చిన ప్రకారం ఈ శాస్త్రములో చెప్పిన అర్థవి
శేషాలు లెస్సగా యెరిగె . . . ఉపదేశించవలెను,
ఎవ్వరు యికరూఢ . . . . మనమాత్రమే మోక్షం గలి
గితే జాలును అని ఉన్నవారు కల్ప వృక్షమువంటి వారని పెద్దలు ఆన
తిత్తురు. అది యెట్లన్నను మన మందరమూ ఎండలోనుండి కల్ప
వృక్షముక్రిందికి అగ్గి దాకిపోయితేను ఆ కల్పవృక్షము నీడ తన మాత్ర
మే కాని వచ్చినవారికి . . . . . కాగా సర్వభూత
దయాళుత్వముగలవారె శ్రీవైష్ణవులు.

**End :**

ఈ మురికి వ్యసనాలలో కొంత వెళ్లి సంసారదుఃఖమునుగడచి
విరజదాటి శ్రీ హరిజేరి తల్లి దండ్రులతోను బంధువులతోనుకూడె
పర్యంతమున్ను యామరక స్వామికథలచాత నే కాలము గడపవలెను.
ఈ మనుష్య జన్మమున్ను దొరకదు. ఈ రామానుజ దర్శనమున్ను
దొరకదు. ఇటువంటి ఆచార్యులున్ను దొరకరు. ఇటువంటి జ్ఞానాధి
కులున్ను దొరకరు. పీరిభాగ్యంవల్లను మీకు ఈలాగు కాంగా దొరికెను.
గాలి కలిగినప్పుడె తూరుపార యెత్తుకోవలెను ఈ దేహం ఉన్నప్పుడే
మోక్షయత్నం కాయవలెన.

"మోక్ష శాస్త్రం సంపూర్ణం"

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిది కాదు. తప్పులున్నవి. శైథిల్య
గ్రంథ పాతములునుగలవు.

విశిష్టాద్వైత మత ప్రకారమున మోక్షప్రాప్తి యిందుఁజెప్పబడి
నది. అరవ గ్రంథమునకిది తెలుఁగైయుండును.

(*d*) ప్రపన్నదినచర్య.

PRAPANNADINACARYA

Foll. 13-*a*—14-*b*.

(*e*) गीतार्थसङ्ग्रहः

GĪTĀRATHASAÑGRAHA.

Foll 15-*a*—64-*b*.

See Sanskrit part

---

R No 838.

**Palm-leaf. Size, 17 × 1⅜ inches. Foll. 148 Lines, 7 on a page. Mode of writing, fair but not free from mistakes Much injured**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

మహాభారతము (తిక్కన).

MAHĀBHĀRATAMU (BY TIKKANA).

Incomplete

This is the same work as the one described under R. No. 374 of the Triennial Catalogue of Telugu Manuscripts, Vol III.

Contains 1 to 4 āśvāsas in Śāntiparva and 5th āśvāsa incomplete

(వి-వి.)—

అసమగ్రము. శాంతి పర్వము మాత్రమున్నది. ప్రథమద్వితీయతృతీయచతుర్థాశ్వాసములును, పంచమాశ్వాసమునఁ గొన్ని పద్యములును గలవు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములుగలవు.

ఇది ఆర్. నెం 374 రున వర్ణితమైనదే.

---

R. No. 839.

**Palm-leaf. Size, 16 × 1⅜ inches. Foll. 206 Lines, 6 on a page. Mode of writing, good but not free from mistakes. Injured**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

వైశ్యపురాణము.

VAIŚYAPURĀNAMU (BY BHĀSKARĀCĀRYA).

This is the same work as the one described under R No 91 of the Triennial Catalogue, Vol. I.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

వాసవీమాహాత్మ్యమను పేర నీగ్రంథము ఆర్. నెం 91 రున వర్ణిత మయినదే. కర్త భాస్కరాచార్యుఁడు.

గ్రంథాంతమందిట్లున్నది —

“ పింగళనామ సంవత్సర భాద్రపద శుద్ధ ౧౩ వరకు కన్యకాపు రాణం యనిమిది ఆశ్వాసాలు వ్రాయడమైనది.

కరివెన అగ్రహారీకుడైన శ్రీధర నాగయ్యగారి పుత్రుడైన రంగయ్య స్వహస్తం వ్రాసుకున్నది కన్యకాపురాణం. ”

---

## R. No. 840.

**Palm-leaf. Size, $14\frac{3}{4} \times 1\frac{3}{8}$ inches. Foll. 156. Lines, 6 or 7 on a page. Mode of writing, fair but not free from mistakes. Much injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

వైశ్యపురాణము.

VAIŚYAPURĀṆAMU (BY BHĀSKARĀCĀRYA).

This is the same work as the one described under R. No. 839 of this volume.

Incomplete.

(వి.వి.)—

అసమగ్రము. అష్టమాశ్వాసము చివర భాగమిందు లేదు. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు. ఇది ఆర్. నెం 839 రున వర్ణితమైనదే. కర్త భాస్కరాచార్యుఁడు గ్రంథాంతమున 11 పత్రములలో భాగవత ప్రథమాశ్వాస భాగము గలదు.

---

## R. No. 841.

**Palm-leaf. Size, $14 \times 1\frac{1}{4}$ inches. Foll. 108. Lines, 5 or 6 on a page. Mode of writing, fair but not free from mistakes Good.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

(బి) రాధామాధవ సంవాదము.

RĀDHĀMĀDHAVASAMVĀDAMU (BY VELIDINḌLA VENKAṬA-PATI).

Foll. 1-*a*—45

This is the same work as that described under R. No. 339 (*b*) ante.

Incomplete.

(బి-బి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములక్కో లేవు.

ఇది ఆర్. నెం 339 (*b*) గా వర్ణింపబడినదే. కర్త వెలిదిండ్ల వెంకటపతి.

(b) హనుమద్దండకము.

HANUMADDAṆḌAKAMU.

Foll. 46—58.

This is the same work as that described under D. No 2035.

Complete.

(బి-బి.)—

సమగ్రము. వ్రాఁతయంతమంచిది కాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములక్కో లేవు.

ఇది డి. నెం 2035 గా వర్ణితమైనదే.

(c) शब्दमञ्जरी.

ŚABDAMAÑJARI.

Foll 59—65

See the Sanskrit catalogue of manuscripts

(d) विष्णुमहिम्नस्तवः

VIṢNUMAHIMNASTAVA (WITH KANARESE TIKA).

Foll. 66-*a*—85-*b*

See the Sanskrit Catalogue of manuscripts

(e) सुभाषितग्रन्थः (कर्णाटकटीका सहितः)

SUBHĀṢITA GRANTHA.

Foll. 86—108-*b*.

See the Sanskrit catalogue of Manuscripts.

---

R. No 842.

Palm-leaf. Size, 15¼ × 1⅝ inches Foll. 113. Lines, 7 on a page. Mode of writing, good but not free from mistakes Much injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928

మహాభారతము.

MAHĀBHĀRATAMU (BY NANNAYA AND TIKKANA)

Same work as that described under R No 154 and D. No 288.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. సభాపర్వము, మౌసల మహాప్రస్థానిక స్వర్గా రోహణపర్వములిందు గలవు. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శై థిల్య గ్రంథపాతములమితములు.

గ్రంథాంతమున నిట్లుగలదు—

“ అవ్యయనామ సంవత్సర భాద్రపద బ ౧౦ యిందువాసరంసరికి వత్సవాయ జోగిరాజా స్వంతముగా వ్రాసుకొనెను.”

---

R No 843.

**Palm-leaf. Size, 16½ × 1¼ inches Foll. 68. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

వచనరామాయణము.

VACANARĀMĀYAṆAMU.

A prose work describing briefly the story of the Rāmāyaṇa. The author is not known

Incomplete

**Beginning :**

ఇట్లు పాండునందనులు ధర్మరాజు, భీమార్జున, నకుల సహదేవు లను పాంచాలియు వనవాసంబు సేయుచున్న మార్కండేయ మహాముని యావనంబున కరుగ వారలా మునింగనుంగొని సాష్టాంగ నమస్కార ములు సేసి అర్ఘ్య పాద్యాదులొసంగి మేము చేసిన భాగ్యంబువలన మీరీవనంబునకు విజయంచేసితిరి. తమ దర్శనంబువలన మేము కృతార్థులమై తిమి. మా కష్టంబు తీరుననిన విని యామునీశ్వరుండిట్లనియె. ఓ రాజ శేఖరా ! యాపదలకోర్చి సంపదలనుభవింపుమను శాస్త్రంబెరుంగవె. తొల్లియుగంబున మీవలెనె శ్రీరామచంద్రుండు సీతా లక్ష్మణుండును నీ ముగ్గురు పదునాల్గేళ్లు వనవాసంబు చేసి సకల కష్టంబులనుభవించిన వెనుకసుఖంబుగానుండి చేయునిన . . . . . . . .

* * * *

**End :**

దేవతలు దశరథునితోకూడా తమతమ స్థానంబులకరి . . సుగ్రీ . . . . . . నీవును జాంబవంతా నీవును మీశా

గల దీసుకుని మీ స్థానాలకు పొమ్మనగ, వారందురు స్వామీ అయోధ్యకు వచ్చి తమ పట్టాభిషేకంబుచూచి వస్తామనిన మంచిదని విభీషణుండు

. . . . . . -

* * * *

**Colophon :**

ఇది బాలకాండా అయోధ్యకాండా రెండు వాల్మీకి మహాముని చేసిన రామాయణంబులో దీనియందు అర్థంబుతోచిన మాత్రంబు వచన రూపకంబుగా చేసిన కథ సంపూర్ణం

(వి-వి.)—

అసమగ్రము. యుద్ధకాండ చివరభాగమిందు లేదు. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములట్టే లేవు.

రామాయణ కథ సంగ్రహ వచన రూపముగా నిందువర్ణితము. కర్త యెవ్వరో యెఱుఁగరాదు.

---

R. No 844.

Palm-leaf. Size, 16 × 1¼ inches. Foll. 156 Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes Much injured

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

హంసవింశతి.

HAMSAVIMŚATI (BY AYYALU RĀJU NĀRĀYAṆA KAVI)

Same work as that described under D. No. 912 of Descriptive Catalogue Vol. III, Part 2.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు. కర్త అయ్యలు రాజు నారాయణకవి.

ఇది డి. నెం 912 రున వర్ణితమైనదే.

గ్రంథాంతమున నిట్లున్నది—

“ దుందుభినామ సంవత్సర ఆషాఢ బ ౧౨ ల వరకు తిరుమలబుక్కపట్నం తాతాచార్యులు తానున్ను, తన తమ్ముడైన రంగాచార్యులు చాతనున్ను కొంత వ్రాయించి ముగింపు చాయడమైనది. పెద్దలైనారు హస్తాక్షర శబ్ద దోషములను సవరించి క్షమించుము. ”

## R. No. 845.

**Palm-leaf. Size, 16¼ × 1¼ inches. Foll. 57. Lines, 6 on a page. Mod of writing, fair but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

వాస్తుసారసంగ్రహము (గణపయ).

VĀSTUSĀRASAṄGRAHA (BY GANAPAYA)

Foll. 24—42.

This is the same work as that described under R. No. 36 of Triennial Catalogue, Vol. I.

The name of the author is Ganapaya.

Complete.

(తె-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములుగలవు.

ఇది ఆర్. నెం 36 రున వర్ణితమైనదే. గ్రంథాదిని 23 ఆకులమీఁదను, చివరఁగొన్ని యాకులమీఁదను గృహనిర్మాణమునకు సంబంధించిన సంస్కృత శ్లోకములు టీకతోనున్నవి. కొన్ని తొఱ్ఱలునుగలవు

---

## R No 846.

**Palm-leaf. Size, 16¼ × 1¼ inches. Foll. 210. Lines, 5 on a page. Mode of writing, good but not free from mistakes. Injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

శైవాగమ శిఖామణి.

ŚAIVĀGAMAŚIKHĀMAṆI (BY NEPPALLE APPANĀRYA).

Same work as that described under R No. 462 of Triennial Catalogue, Vol. III, Part III.

Complete.

(తె-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు గలవు.

ఇది ఆర్. నెం 462 రున వర్ణితమయినదే. గ్రంథకర్త నెప్పల్లె అప్పనార్యుఁడు.

గ్రంథాంతమున—

"శా. భావాబ్ధాశ్వి జమాసబహుళ పక్షప్రత్యక్తి థినొప్పగా
శైవామ్నాయశ్శిఖామణీయనెడి శాస్త్రంబంతయున్ బూర్తిగా
దేవేంద్రాదులు మెచ్చ పాల్పర్తి చిన్నంరాజు పుత్రుండు దా
శైవారుండు మల్లురాసె యిలనాచంద్రార్కమై యుండగన్."

అని యున్నది.

---

## R. No. 847.

**Palm-leaf. Size, 14¼ × 1¼ inches. Foll. 200. Lines, 6 on a page. Mode of writing, good but not free from mistakes. Slightly injured.**

Presented by the Maharaja of Pithapuram in the year 1928

పంచతంత్రము.

### PAÑCATANTRAMU.

This is an excellent Telugu rendering of the same work in Sanskrit. It contains some stories not found in the Sanskrit original The author is Vēnkaṭanāthakavi.

Complete.

**Beginning :**

శా. శ్రీవృత్తస్తన నిస్తులైణ మదసంసిక్తంబురో వీథిబా
హై విన్నాణపు పుట్టుమచ్చరవి కన్యాసన్న విశ్వంభరా
దేవీ విభ్రమలక్ష్మి తేట పరపండీపించు త్రైలోక్య ర
క్షావర్ధిష్ణుండు కృష్ణుఁ డూర్జితమనీషన్ దిక్కుమాకయ్యెడిన్.

మ. సరసీజాతము లాటపట్టులు నిశాచారారి చంచద్భుజాం
తరమావాసము పుట్టినిల్లు సలిలస్థానంబు దారిద్ర్య భూ
ధర వజ్రాయుధ కోటిచూపు నిగమాంతప్రోక్తులాశంసినీ
పరివర్గాగముగాఁ జెలంగు జగదంబన్ పద్మఁ గీర్తించెదన్.

* * * *

మ. హృదయబ్రహ్మరథం బతిప్రియతమం బెక్కింతు చేతో మరు
త్సదనాస్థానికి డత్తు మానసన భస్సంచారిగాఁ జింతు హృ
ద్విదితక్షీరసముద్ర ఖేలనమునన్ దేలింతు సత్కృత్యవ
స్తుదులన్ బ్రాజ్ఞుల తిక్కనార్యు త్రినమ రేశున్ సోము శ్రీనాథునిన్-

క. వాచావీచీ ధికృత
లోచనకర్ణాగ్రయాయి లోకసుధాంధో

వైచికి దలఁతుఁ మద్వం
శాచార్యు తిరుమల శ్రీయఃపతి గురునిన్.

* * * *

ఉ. అనుటకీరసంబున నహంకృతిదంశితు లల్పకాకవుల్
పీనులనీని మతర్కవిత విద్వదుపాసిత గాక యున్నె యా
హా! నరభుక్తశేష కబళాహరణక్షమ కుర్కురాళికిన్
గాని నవాజ్యధారక్రతు కార్యసమాచరణీయ గాదకో!

* * * *

ఘనతరఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతి తేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవవోలె గూఢమును చాటుదనంబునుగాగ నుండ జె
ప్పిన యదివో కవిత్వమనిపించు నగించటుగాక యుండినన్.

* * * *

అని యిష్టదేవతానతియును పురాతన కవిస్తుతియును నాచార్య పురస్కృతియు సుకవితిరస్కృతియు గావించి యే నొక్కనాడు పంచ తంత్రం బంధ్రభాషా చంపూప్రబంధంబు సేయం బ్రారంభించి యే తత్కావ్య కన్యకారత్నంబునకు ననుకూలవల్లభుం డే దేవుండగు నొకో యని విచారించి శయ్యాతలంబున శయనించిన.

శ్లో. వ్యాప్నిత్వయా చరమయా సమయా ప్రభుత్వం
మౌళౌ తుషారఘృణి నా జగతాం గురుత్వం
సందీపయన్న భసి కోపి మహాన్ పుమాన్మే
స్వప్నే శుభే సితసితద్యుతిరావిరాసీత్.

* * * *

వ. అని ఒక్కొయించి త్రిలోకీకర్తృమత్కృతిభర్తగా నొనర్చి మదీయ వంశావతారం బభివర్ణించెద.

ఉ. ధీరతరాజ వంశజలధిన్ ప్రభవించె మహావిరోధి సం
హారవిహారి సాళ్వబిరుదాంకుఁడు చైతన్యపాలుఁడద్ధరి
త్రీరమణీ మనోహరుని తీవ్రయశస్సతికిన్ హరాద్రినీ
హారవసుంధరా ధరముఁలర్యె సమగ్రవిహారశైలముల్.

క. అలనాడె చక్రితిపతికిన్
బలభిత్ప్రతిమాన భోగపరతంత్రునకున్

గలిగెఁ దిరుమలధరణీ
తలనాథుఁడు నిర్భరప్రతాపోజ్జ్వలుఁడై.

ఉ. అంబుజనేత్రి తిమ్మవసుధాధిపరత్నముకూర్మిపేర్మి తి
ప్పాంబిక పెండ్లియై కనియె నప్రతిమానగుణాఢ్యు వీరభ
ద్రుం బరిపంథిరాజకులతోయధిమందరు ఘోరసంగరా
డంబరు చండభీషణ కటప్రకట ద్విపసైన్యసంకులున్.

సీ. అతఁడు శ్రీపతిరాజు వరపుత్రి
శృంగారములయికర లింగమకర
పరిణయంబై లింగనరనాయకవతంసు
ప్రాభవనిస్తంద్రు పర్వతేంద్రు
గనియె కుమారలింగక్షోణిపాలుండు
యవనసైంధవకాన నానలుండు
పోరులబెకరఁద్ర ఱొరివుచ్చెనమ్మ హీ
ధవుని తమ్ముడు పర్వతప్రభుండు
వైరికాంతార దవవాగి వాహమూర్తి
పోలె పలితిమ్మవసుమతీ పాలపుత్రి
పుణ్యచారిత్ర వికసితాంభోజనేత్ర
నన్నమాంబిక పరిణయంబై ముదమున.

క. ననువెంకట జనవల్లభు
వినుతపరాక్రమునిఁ రంగ విభుధైర్యకళా
కనకాద్రిని శేషాద్రిని
గనియె నిహాముత్ర సౌఖ్యఘటనాయతికిన్.

క. అనపాయ సరసకవితా
రసికుఁడ వెంకటధరావరప్రభుఁడ గుణ
ప్రసవ ప్రకాండమదవ
ద్భసలాయిత విద్వదఖిల బంధుప్రజుఁడున్.

* * * *

తరణి శశిలోచనునకున్
పరమాణువిలోకి యోగమార్గధురాళీ
పరివ్రాతి సనాథునకున్
హరిహరనాథునకు సద్గృహ సనాథునకున్.

సభక్తి సమర్పితంబుగా నాచేనొనర్పఁబూనిన పంచ
తంత్రంబునకు గథాక్రమంబెట్టిదనిన.

* * * *

**End :**

వ. కావున నీవును నాపితునకు దోడువోయినవాఁడవని ప్రాణే
శ్వరుని ప్రాణేశ్వరీదూరి సుఖస్థితినుండిరని విష్ణుశర్మ్యుండు జెప్పిన విని
నీతికథావర్ణనంబున సుదర్శన కుమారులు లబ్ధవర్ణులై పూర్ణులై తండ్రి
నలరింపుచుండిరి.

* * * *

**Colophon :**

గద్య॥ ఇతి శ్రీ వెంకటనాథకరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితా
విలాస సకలసుకవిప్రశంసాభాషణోల్లాస రాజకులపారావార పర్వ
శర్వరీరమణ నీతిశాస్త్రమార్గ పరిశ్రమణధైర్యపర్యాయ ధిక్కృతపర్వత
పర్వతరాజకుమార నిస్సహాయ ప్రబంధనిర్మాణభోజభూదార సుధా
మధుర భారతీసనాథ వేంకటనాధప్రణీతంబైన పంచతంత్రంబున నస
మీక్ష్యకారిత్వమన్నది సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. 26 నుండి 59 దాఁక సంఖ్యలుండవలసిన పత్రములు
గానరావు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాత
ములు గలవు.

సంస్కృతమునఁగల పంచతంత్రమున కిది ప్రశస్తమగు తెలుగు
సేఁత. ఇందు సంస్కృతమున లేని కథలును గలవు. గ్రంథకర్త
వేంకటనాథ కవి. క్షత్త్రియుఁడు. ఈతఁడు యితరుల తోడ్పాటు
లేకుండఁ బ్రబంధ నిర్మాణముచేయుటలో భోజునిఁ బోలినవానిఁగాఁ
దన్నుఁజెప్పుకొన్నాఁడు. విశేషములకు దాహృత గ్రంథభాగముఁ
గాంచునది.

---

R. No. 848.

**Palm-leaf.** Size, 17¼ × 1⅜ inches. Foll. 59. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

వీర సత్పుత్ర నవీన సాహిత్య
సారాభిలాష శేషకవీంద్రభవ్య
శేముషీరచితమై చెలువగు సత్య
భామావిజయ మని ప్రఖ్యాతిగాంచి
యనుపమంబైన మహాప్రబంధమున
ననఘమై ఖరి తృతీయాశ్వాసమయ్యె
ఆదరంగ నీకథ నాలకించినను
చెలువుమీరగ లిఖించిన పఠించినను
జనులకు సంపదల్ సకలపొందికలు
వనజనేత్రుం డపవర్గంబు నొసగు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత చెడ్డది కాదు. శైథిల్యము కొంతకలదు. గ్రంథపాతములేదు. తప్పులు కలవు.

సత్యభామా విజయమను నీ ద్విపద కావ్యమును ఘట్టు పీరకవిపుత్రుడగు శేషకవి రచించెను. రణమున సత్యభామ విజయముగాంచుట యిందలి యితివృత్తము. ఈ కథ ప్రసిద్ధమైయున్నదే. ఇది మూడాశ్వాసములయందు వర్ణింపబడియున్నది. కవి దీనిని భానుముకుళ్ల గ్రామ కరణమును, నాళ్లగట్టు చినలింగ మంత్రి పౌత్రుడును, జక్కన మంత్రి పుత్రుడునగు నెల్లయామాత్యుని కోరికపై వ్రాసి యాగ్రామమున నెలకొనియున్న శ్రీ విశ్వేశ్వరున కంకితమొసంగెను.

ఈ గ్రంథమున వర్ణింపబడిన రీతినే కవికాశ్రయుడగు నెల్లయామాత్యుని వంశమీక్రింద వివరింపబడుచున్నది.


కౌండిన్య గోత్రము
రంగప్రధాని భార్య అక్కమాంబ
చిన లింగమంత్రి భార్య డాకమాంబ.
అయ్యప రాజు. (అంబక్క - పాపమ్మ).
సిద్ధ రాజు (భార్య రామాంబ.)
తిమ్మరాజు భార్య వెంగమ్మ.
జక్కన (డాకమ్మ. బుచ్చెమ్మ).
రామరాజు భార్య బుచ్చెమ్మ.
మురారి.
నారాయణుడు.
బుచ్చెన్న (భార్య మురారమ్మ.)
పెద జగ్గన భార్య అక్కమ
చిన జగ్గన.
గురవన.
గోవిందుడు.
ఎల్లయ మంత్రి భార్య చ్చెమ్మ.
గోవిందుడు భార్య చిన్నమ్మ.
వెంకటాద్రిపుడు.
లక్ష్మీపతి.
గోవిందుడు.
గోవిందుడు.
అయ్యన్న.
పెద నాగన్న భార్య అక్కమ్మ.
చిన నాగన్న.
కామరాజు.
లింగన.
బుచ్చెన.
* కవిశాశ్రయుం డితండే.

(ం) రేవతీ పరిణయము.

## RĒVATĪPARIṆAYAMU

Foll. 56—58.

The marriage of Balarāma with Rēvati is described herein. The name of the author is not known.

**Beginning :**

శా. శ్రీలక్ష్మీగమణీమణీ మణిఘృణి శ్రీనీ సదా ప్రోల్ల స
ల్లీలన్ బేరెదఁదాల్పు వాగచట వ్రేల్లే వైజయంతీ లతా
డోలా . . దలంప నవ్వ్యజగదాధ్యుం డాదివిష్ణుండు శాం
తాలంకారుఁడ సింహాబలాద్రి నరసింహస్వామి ప్రోచున్ మమున్.

సీ. పద్మాసనము పద్మపత్రాయతా . .
. . . స్యంబులే పణతిగొప్ప
ఘననితంబంబును గంభీరనాభి వి
భ్రమ విలాసంబు లేరమణికమరు
స్తనభరనమితయై ధవళవస్త్రోత్తరీ
యంబుతోఁ దనరు నేకంబుకంతి
ఇరువంక సౌవర్ణ పరిపూర్ణకరముల
దాల్చి కుంభీంద్రుఁడే తరుణిఁగొలుచు
నే మహాదేవి కనుగొనలీనుచుండు
నలమహా పద్మ పద్మవంశాదినిధుల
నా జగన్మాత హరిరాణి యాదిలక్ష్మి
సిరులొసగి ( . . . . . ) మమ్ము రక్షించుఁగాత !

చ. భవుఁడలిగిస్తుఁ డీవులకుఁ బ్రాపుఁడుగాఁడను మూర్ఖతోడ వై
శ్రవణున కాత్మసఖ్యమును సంపదలిచ్చుట సాక్షిగాదె యి
ఖ్ఖువినని తెల్పు భక్తులను బ్రోవఁగఁ జాలిన సర్వమంగళా
ధవుఁడు సదాశివుండు సతతంబు విభూతి నొసంగు గావుతన్.

సీ. చేవేల పడవాలు జాజాల పొడతోలు
పట్టిగా ధట్టిగాఁ బరగు మేటి
నీరుపామువు దిట్ట బోరపై పూఁజుట్ట (!)
లమ్ముగా సొమ్ముగా నమరుజాణ
. . మదంబుఁ జెంపరు నిద (!)
యన్నుగాఁ గన్నుగానలరు వేల్పు

విలరేనినునుజోడు ? తెలరాసిపెనుఁజేఁదు
పూఁతగా మేఁతగాఁ బొసగుచేఁడు.
తనకు వశగతుఁడై యర్ధతను వొసంగ
నా మహాదేవు నతిమహిమాఢ్యుఁజేసి
. . . యాజగజ్జనని గౌరి
మత్కృతికి సాయమొసఁగు రమ్యంబుగాఁగ.

* * * *

చ. చతురాస్యాననవాటిఁ బొల్పమరఁగా సంగీతసాహిత్యరా
జిత విద్యామయమూర్తియొప్ప విలసత్స్వేతాబ్జపీఠంబు
. . . . . . . . ద్రష్టయౌ స్రష్టభా
గ్యముమీఱన్ మనకిచ్చుఁగాత మతిదీర్ఘాయుర్విశేషోన్నతుల్.

ఉ. శంకరునంక మెక్కియును జయ్యననెక్కి శిరోభ్రగంగలో
బంకజముల్ కరంబమరఁబట్టి తెముల్చుచు నైజచేష్టమై
శాంకరిపాదసన్నిధిని సారెకు వైచి ముదఁబొనర్చి యా
వంకఁదదంక మెక్కు . . . ద నిష్టసిద్ధికిన్.

* * * *

క. అయవృత్తి రేవతీ పరి
ణయమును జెప్పంగఁబూను నాస్వప్నమునన్
నయగతి మజ్జనకుఁడు నం
దయమంత్రీశ్వరుఁడు పొలిచి తానిట్లనియెన్.

క. ఆద్యంతముగా నెకడ
గద్యలు లేకనాయ ? గద్యకావ్యముఛందో
వేద్యంబగు నానావిధ
పద్యంబులు చెప్పినావు పండితులలరన్.

క. ఇలువేలుపు మనకున సిరా
బలనరహరిగాన నీప్రబంధోత్తమమా
జలజదళాక్షున కిమ్మని
పలికిన నంగీకరించి భావంబలరన్.

క. అనఘుంబగు మద్వంశం
బునఁ బూర్వజులైన సుజనముఖ్యులఁగీర్తిం

తుసు యాజ్ఞవల్కి మునిపా
వసునిగ మాచారగమహిమ వర్తిలువారిల్.

సీ. శోభిల్లు శుక్లయజుశ్శాఖులలఘు కా
త్యాయనసూత్రు లుత్తమచరిత్రు
లతి దానధర్మసాహాస సుశీలాదిక
సద్గుణోపేతులు జనవినుతులు
సకల విద్యావిదుల్ సర్వజ్ఞులు శతాంత
రంగాభియాతి గర్వప్రశమనులు
సగృహ . . చారసంపన్నులు
హానుమకొండా గ్రహారాధిపతులు
వెలసిరిల . . వివేకమతులు
ధైర్యగాంభీర్య ఘననీతి కార్యపరులు
మహితకౌండిన్య గోత్రాబ్ధి తుహినకరులు
ఘనులు మా పెద్దలున్నతి . . .

* * * *

మ. అనఘుల్ తత్కులమందు సిద్ధనయు జకార్కమాత్యుడుల్ బెద్దిరా
జును మల్లార్యుడనంగ సోదరులు సం . . . పా
వనతల్ శ్రీగిరి పశ్చిమాశనతి భాస్వద్ధామగట్లుస్థలిల్
మనికింజేసి ప్రతిష్ఠచేసిరచటల్ మైలారు లింగేశ్వరుల్.

* * * *

సీ. అందు జకార్కమాత్యనందనుల్ భీమని

* * * *

మల్లప్రధానిసం తతులు పెంపొందిరి
వసుధ మల్లమరాజువారలనగ
. . షేయు గాంచిరి పగిదివారు
వారిలో . . ప్పరాజకుమారకుండు
. . మంత్రీశ్వరుండు విచారఘనుడు
కంపమల్లాన్వయ ఖ్యాతిగాంచెనిట్లు.

సీ. మహిమమీరను కంపమల్ల పేరయమంత్రి
రహితత్పుత్రుడు మాచిరాజునెగడె
నాధీరునకు (?) పర్వతాఖ్యాసతికిగనె (?)
పోచెయ్య ఓబయ్య భువిని వెలసి

దండనాథయ కన్న . . . పు
త్రులు బాచిరాజాహ్వయు . . పెద్ద

(వి-వి.)—

అసమగ్రము. కృత్యవతరణికాభాగమేని తుదదాఁక లేదు. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములుగలవు.

రేవతీపరిణయమని పేరునుబట్టి యిందు బలరామ వివాహకథ వర్ణితమైనట్లు తెలియనగును. గ్రంథమెన్ని యాశ్వాసములుగలదో కర్తపేరేమో తెలియదు. గ్రంథకర్త అనుమకొండ ప్రథమశాఖ బ్రాహ్మణ వంశమువాఁడనియుఁ దద్వంశమునఁ బూర్వులు శ్రీగిరి పశ్చిమ దిశను దామగల్లు అనుచోట మైలారేశ్వరస్వామిని బ్రతిష్ఠించినారనియు నిందుఁ దెలియనగును. లక్షణగ్రంథములలో మడ్డికాయల మల్లయ కృతముగాను దాహృతమగు రేవతీ పరిణయము వేఱొకటి కాఁబోలును !

---

R. No. 872.

Palm-leaf Size, 15 × 1½ inches. Foll. 25. Lines, 5 or 6 on a page. Mode of writing not bad, but contains mistakes. Slightly injured.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

ఛందోలక్షణము.

CHANDŌLAKṢAṆAMU.

A work on prosody dealing with Yati on the lines of the Appakavīyamu The author is unknown.

Incomplete.

**Beginning :**

క. శ్రీవనితా సమభూతన
యావక్షో జార్ద్రకుంకుమాంకితవక్షః
పావనతరచారిత్రుని
సేవింప దలంచువాడ శ్రీరఘురామా !

సంజ్ఞా ప్రకరణం.

క. విద్యలలోపలనుత్తమ
విద్య కవిత్వంబు మరి కవిత్వము ఛందో
వేద్యంబుగాఁగ జెప్పెద
హృద్యంబుగ కవితచంద మేర్పడ కృష్ణా !

క. వృత్తంబులు గణబద్ధము
లుత్తమమగుజాతులెల్ల నొనరగ మాత్రా
యత్తంబులు లఘువగుపురు
షోత్తమ యొకమాత్ర గురువులాదిద్విమాత్రల్.

**End :**

సీ. కాకును కఖగఘల్ చఛజఝల్ శషసలు
అహాయలకెల్ల కిఱ్ఱ్యలు ఘటిల్లు
కి . ... క్రావడి గిలకయు రేఫకు
నాముడి చెల్లును (నణలకెల్ల)
మాముడి చెల్లును మాకు నింబాలకు
తాముడి చెల్లును తథదధలకు
పోలింప పుఫుబుభుల్ మాలకు జెల్లును
లాముడి చెల్లును లళలకెల్ల
తలపతలకట్లకెత్వ మాత్వంబుజెల్లు
యిత్వమేత్వంబు బుత్వంబునేకసరణి
కొమ్మనొత్వంబు నాకరసై కొమరుమిగులు
యతులకిది లక్షణంబు పద్మాయతాక్ష !

యతిప్రకరణము సమాప్తం

శకట రేఫలు—

క. ఎఱిఁగింతు శకట రేఫల
తెఱఁగు తెలుఁగునకునుపలయు...కవీంద్రా !
యెఱిఁగింతుఁ జిత్తగింపుఁడు
కఱకంఠుని కరుణచేత కవివరులారా !

గీ. ఊది పలుకుపలుకులూదక పలికిన
రేఫగాని శకట రేఫకాదు.
పదము మొదల నిడుపతుద తద్భవంబుల
రేఫగాని శకట రేఫకాదు.

సీ కఱ ........ ..

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు పెక్కులు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది యతివిషయమును వివరించు గ్రంథము. కవి యెవరో తెలియదు. అప్ప కవీయము ననుసరించి యిది వ్రాయఁబడినట్లు తోఁచును.

గ్రంథాదిని ముఖపత్రముపై “ అప్పకవి లక్షణం పుస్తకము. గోవిందాచార్యులుగారు చెప్పినది ” అని వ్రాయఁబడియున్నది—

---

R. No 873.

Palm-leaf. Size, 16¼ × 1½ inches. Foll. 30. Lines, 6 or 7 on a page. Mode of writing, good. Free from mistakes. Slightly injured.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram

ఆంధ్రశబ్ద చింతామణి—సటీకము.

ĀNDHRAŚABDACINTĀMAṆI (WITH COMMENTARY) (BY NANNAYA BHAṬṬU)

Same work as that described under R No 142 The author of the commentary is Elakūci Bālasarasvati.

**Beginning :**

శ్లో॥ విశ్వశ్రేయః కావ్యం
తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ ।
సా వాగ్యా రసవృత్తిః
సాధ్యో హి రసో యథాయథం కవిభిః ।

**End :**

అత్వాది తత్సమానా
మివ దేశ్యానాం క్రియాపదానాం చ ।
వర్ణగతో విశేషః ... (?)
పురుషేష్వర్థేము చాపి వచనేషు

**Colophon :**

ఇతి శ్రీ సకలభాషా వాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్ర శబ్ద చింతామణౌ క్రియాపరిచ్ఛేదః

**Beginning of the commentary :**

కావ్యము సమస్తములైనటువంటి శ్రేయములుగలది. ఆ కావ్యము అపార్థం మొదలైన దోషరహితములైనటువంటిన్నీ, గుణాలంకార సహితములైనటువంటిన్నీ వాక్యార్థమున్ను... ......... యేది విభా

వాది రసములయందు వ్యాపారం గలదో అది శబ్దమనిపించుకుం టున్నది. కవీశ్వరుల చాతను యేయేరసములచాత నైనానున్నరసము పాలింప తగ్గది.

**End :**

అత్వాది తత్సమానాం. ॥ దేశ్యములైన క్రియా పదములకున్ను తత్సమ క్రియాపదములవలె ప్రథమాది త్రివిధ పురుషలయందున్ను, తద్ధర్మాది చతుర్థ ధాత్వర్థములయందున్ను, ఏక బహువచనములయం దున్ను అవును. చేయును, చేయుదురు, చేయుదువు, చేయుదురు, చేయుదును, చేయుదము. ఇక్కడ ఉతోచ్చ సర్వేషు అని దుకా రముయొక్క ఉకారమునకు అత్వము వచ్చెను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులు లేవు. కొలఁది శైథి ల్యము కలదు. గ్రంథ పాతములు లేవు.

ఇందుమూలము వేఱుగను, వివరణము వేఱుగను కలదు. చివఱ నొక పత్రమున శ్రీకృష్ణ స్తుతి పద్యములు కలవు.

గ్రంథాంతమున—

క. శ్రీస .. ...... ళ సుబ్రహ్మణ్యుడు
సశిబాల సరస్వతీయు సమన్నయవా
కృతిస్మృతవ్యాకృతి జూచి బు
ధసమితికిఁ ప్రీతిగూర్పదగనిది జేసెన్ ॥

అనియున్నది.

ఇది ఆర్. నెం 142 రున వర్ణింపఁబడియున్నది.

---

R. No. 874.

Palm-leaf. Size, 17¼ × 1¼ inches. Foll 20. Lines, 6 or 7 on a page. Mode of writing, good. Free from mistakes and omissions. ightly Slinjured.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram

Foll. 1 and 22 are left blank.

Foll. 1—10.

(a) మానసబోధ శతకము.

MĀNASABŌDHA ŚATAKAMU. (Printed.)

A centum of stanzas describing the greatness of God Viṣṇu and addressing the soul to worship Him. The author is Pānakālarāyuḍu of Tāḍēpalli.

Complete in 108 stanzas.

**Beginning :**

ఉ. శ్రీరమణీమణీ హృదయసేవితముల్ నవఫుల్లహల్లక
శ్రీరమణీయ సుందర విశేష విలాసము లబ్జ సంభవో
దారవినీల రత్నలలితద్యుతి పూర్ణములభ్ర గాంగగా
సారతరంబు లంచు మనసా ! హరిపాదము లాశ్రయిం
చుమా !

ఉ. దండిగ చట్టరాతిని యథావిధి నంగనగా నొనర్చె ను
ద్దండతఁగొండ జెల్వను ముదంబుగఁజేసెను దివ్య
దేహిగాఁ
ఖండితులైనవారి నెడఁబాయక బ్రహ్మపదంబునిచ్చెనీ
చండి తనంబు మాని మనసా ! హరిపాదము లాశ్ర
యించుమా !

* * * *

**End :**

ఉ. పాయక తాడెపల్లికుల పావనుఁడై విలసిల్లు పానకాల్
రాయనిచేఁ బ్రణీతమయి రంజిలు మానసబోధ
యోగసం
ధాయక పద్యసంస్తవ శతం బనిశంబు పఠించి
మోక్షసం
ధాయత పొందదీవు మనసా !......

ఉ. మంగళమబ్ధిజాసహిత ! మంగళ మంగజకోటిసుందరా !
మంగళ మార్యలోకహిత ! మంగళ మంబుజ పత్ర
లోచనా !
మంగళ మభ్రకేశనుత ! మంగళ మాహవరంగ
భీమ ! దై
త్యాంగ విభంగ ! యంచు మనసా ! హరిపాదము
లాశ్రయింపుమా !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథ పాతములు లేవు.

ఈ శతకమును తాడేపల్లి పానకాల రాయుఁడు రచించెను. ఇందు ౧౦౮ పద్యములలో విష్ణుస్తుతియు, మనస్సును గురించి హరి నాశ్రయింపవలెనను ప్రబోధమును వర్ణితములు.

గ్రంథాంతమున—"బహుధాన్య సం॥ ఆశ్వయుజ బ॥ ౨ స్థిర వారం రోజున వ్రాసెను. శ్రీశ్రీ" అని యున్నది.

Foll. 11—18.

(b) సేతుని కథ.

SĒTUNI KATHA.

The story of Sētu is described in this work. The author's name is not known.

**Beginning :**

శ్రీమద్ధరిత్రీధ రేంద్రాత్మ జాశ్లిష్ట సౌఖ్య ప్రమోదాంతరంగా తటి ద్వల్లికారుక్చటాకల్ప భాస్వజ్జటాంతర్నటన్నిర్మల ద్యోధునీ తుంగ భంగా కరాగ్రత్రిశూలాసి ఖట్వాంగ ఢక్కాకురంగా శరచ్చంద్రికా తుంద కర్పూరడిండీర నీహారహీరోపమ స్వచ్ఛశోభామయాంగా! కృపాసారమున్పొంగ మీ భక్తవర్గంబు నత్యంతకారుణ్యదృ ..... ..... ంచవై వీక్షింపుచున్ పెంపుచున్—

*　　*　　*　　*

**End :**

పార్వతీ దేవివామాంకమందున్ రహింగులకు వాద్యంతముల్ గన్గానంగాని రూపంబుతో సతక్కృపాపాంగ వీక్షామృతాసారము ప్పొంగఁ బ్రత్యక్షమే నిల్చినన్ జూచి సాష్టాంగ దండప్రణామంబుగా వించి హస్తాబ్జముల్ మోడ్చి శంభో మహాదేవ తే పాదభక్తిం సదా దేహి మేయంచు సంస్తుత్యముల్ జేసి కాత్యాయినిం జూచి దేవీ మహోత్తుంగభంగావళీ శుద్ధ శుద్ధామృతాంభోధి మధ్యామరోర్వీజ వాటీ సమావేష్టితోద్యన్మణిద్వీపవాసీ... ..........

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. కొలఁది తప్పులు కలవు. కొలఁది శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

ఇందు సేతుని కథ వర్ణింపఁబడి యున్నది. గ్రంథకర్త పేరెఱుఁగ రాదు.

వేఱుగ రెండు పత్రములనందుః జూర్ణికలను పేరున భగవత్ స్తుతి సంస్కృతమునఁగలదు.

---

R. No. 875.

Palm-leaf. Size, 16 × 1¼ inches. Foll. 9. Lines, 5 on a page. Mode of writing, good, but not free from mistakes. Condition good. Not printed

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

9th fol. is left blank.

సభాపతి వచనము.

SABHĀPATI VACANAMU.

The characteristics of the president of an assembly are described in this. The author is not known.

Complete.

**Beginning :**

క. శ్రీరమ్యుఁడు సంతతశ్రం
గారుఁడు రాజాన్వయప్రకారుఁడునుతదా
నారూఢుఁడు సకలకళా
పారాయణుఁడనఁగనా సభాపతియొప్పున్.

క. తరుణుండై నవరత్నా
భరణుండై గంధపుష్ప పరిమళయుతుఁడై
పరనారీ వర్జితుఁడై
బరగినవాఁడమరునా సభాపతి యనఁగన్.

వ. ఇట్లు కొలువున్న సభాపతి లక్షణం బఖిల జగదుత్పత్తిహేతు భూతుండైన బ్రహ్మదేవుని వామభుజంబులందుద్భవంబైన.

* * * *

**End :**

ప్రభ్రష్టరాజ్యంబులు నిలుపుట యిది యాదిగాఁగలుగు ధర్మవర్తనల తెలంగటింగించి, పాపంబులం బొరయక రాజ్యంబు సేయుచున్నవాఁడు సభాపతి యనఁగఁదగును.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

సభాపతియొక్క లక్షణమిందు వచనరూపముగఁ జెప్పఁబడినది. కర్త పేరెఱుఁగరాదు.

గ్రంథాంతమున "శాలివాహన శకంబులు వెయ్యిన్ని యేడున్నూట పధ్నాలుగు కాగా పరీధావి సంవత్సర శ్రావణ శు॥ ౨ మందవాసరం సరికి సిరువూరి గురువరాజు స్వహస్తలిఖితమేతద్గ్రంథం శ్రీ లక్ష్మీనారాయణార్పణమస్తు." అనియు, నాపిసప "ఒకటిఁగొని రెంట నిశ్చల యుక్తిఁ జేర్చి" అను పద్యమును గలదు.

---

R. No. 876.

Palm-leaf. Size, 16¾ × 1½ inches. Foll. 8. Lines, 5 on a page. Mode of writing, not bad, but contains mistakes. Slightly injured. Not printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

కపోత వాక్యము.

KAPŌTA VĀKYAMU.

The story of the dove and the hunter found in the Mahābhārata—Śāntiparva is described herein. The author is unknown.

**Beginning :**

క. శంకర పాప భయంకర
కంకాళకపాలహస్త గంగాధిపతీ
ఓంకారమంత్రమందిర
కంకణభుజగేంద్రనాథ కారుణ్యనిధీ !

వ. అవధరింపుము నాయొనర్పంబూనిన కపోత వాక్యంబునకు కథా క్రమం బెట్టిదనిన.

క. శ్రీరామచంద్రుఁ డడవిలో
ధీరతసుగ్రీవుతోడ చెలిమిసఖిత్వం
బారయ జేసిన నతఁడువ
తారియు గాకున్న జూచి కనకస్థలి కేగె.

గీ. తొలినొకఁడు శబరుఁడు దురితాత్ముఁడుపకారి
యైనవానిమని చె నడవిపక్షి
యనిన రామచంద్రుఁడనఁగ్రోధియుక్త్యంబున
కొరిగి యతడుబలికె వెరవుతోడ.

* *

**End :**

గీ. అట్లు బ్రతుకుమీదయాస చెడి ?
ఘట్టిగా (ను) శుష్కకాష్ఠచయము
ప్రోవుచేసినట్టి భూరిదావాగ్నిలో
బడియె నెరుక పరమ భక్తితోడా ।

వ. అట్లు ప్రాణంబులు విడిచి యెరుకున్ను పక్షులు రెండున్ను దివ్యదేహంబులు ధరియించి దివ్యవిమానం బెక్కి పరమ జ్ఞానులై యమ్మహాదేవుని సమ్ముఖంబున నుండిరని శ్రీరామచంద్రుండు సుగ్రీవునితో చెప్పిన సంపూర్ణసం గోపాత్ముడయ్యెనూ.

క. జలనిధులు చంద్రసూర్యులు
కులగిరులును తారకములు కుంభినియందున్
కలకాలము వర్ధిల్లును
సలలితముగ రామచంద్ర చరితము లెల్లనూ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చెడ్డదికాదు. తప్పులు మెండుగ గలవు. శైథిల్య గ్రంథపాతములట్టె లేవు

శాంతి పర్వమునందలి వ్యాధకపోతో పాఖ్యానమే యిట్లు పద్యకావ్యముగ వ్రాయఁబడినది. గ్రంథకర్త పేరెఱుఁగరాదు. గ్రంథాంతమున " ప్రభవ సం॥ ఆశ్వీజ శు॥ ౫ గు, మూంప్రొద్దు సరికి కపోతవాక్యం శాఖరు మహాంత్తి అప్పయ్యగారివద్ద గంద్రెట్టి బంగారయ్య సంపూర్ణగాత్సదివెనూ" అని యున్నది.

---

**R. No. 877.**

Palm-leaf. Size, 15½ × 1½ inches Foll. 25. Lines, 6 on a page. Mode of writing, not bad, contains mistakes. Slightly injured. Printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

వేంకటేశాంధ్రము (సర్వలక్షణ శిరోమణి).

VEṄKAṬĒŚĀNDHRAMU (SARVALAKṢAṆA ŚIRŌMAṆI).

Same work as that described under D No. 1386. The name of the author is Ganapavarapu Venkaṭakavi.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చెడ్డదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లంతగాలేవు.

ఇది డి. నెం 1386 రున వర్ణింపఁబడినదే యున్నది. కర్త గోపవరపు వెంకట కవి.

---

R. No. 878.

Palm-leaf. Size, 13¼ × 1½ inches Foll. 35. Lines, 7 on a page. Mode of writing, good, contains slight mistakes. Condition good. Printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

విజ్ఞాన ప్రదీపిక.

VIJÑĀNAPRADĪPIKA

A work on Yōga in four Āśvāsas. The author is Cenna Vīraya, son of Gōpāyāmātya

Complete.

**Beginning :**

క. శ్రీ కృష్ణునకును బహువిధ
లోకస్తుత్యునకు సకల లోకేశునకుఁ
గాకోదరవరశాయికి
నాకాకఁ ప్రమధకిరణ నైపుణ్యునకుఁ ?

వ. అనేక దండనమస్కారంబు లాచరించి నాయొనర్పంబూనిన యోగకావ్యంబునకు నామ నిర్ణయంబెట్టిదనిన—

క. పదునెనిమిది విద్యలలో
సదమలమగు సారమెల్ల చర్చించిమదిన్
పదిలముగ నెరిగి చెప్పగ
నదివిజ్ఞాన ప్రదీపకనునుతి కెక్కెఁ.

వ. ఇట్టి విజ్ఞాన ప్రదీపకయను యోగకావ్యంబు సకల జనసమ్మతంబును సకల శాస్త్రసమ్మతంబును సకల మత సమ్మతంబును నైయుండుగావున తత్ప్రారంభంబెయ్యది యనిన.

* * * *

**End :**

సీ. చిద్రూపమైనట్టి జీవాత్మయఁదును
పరమాత్మభావంబు పదిలపరచి
ప్రకృతిసాంగత్యంబు పరిహరింపగనేర్చి
పురుషుని సర్వసంపూర్తి మెఱిగి

దేహేంద్రియాదుల తీవ్రవేగంబున
బోరయక చిత్తంబు పొంతజనక
కర్మద్వయంబుపై కత . . వ్యామొందక
సుకృతదుష్కృతముల జొట్టుపడక
ఆత్మభావంబుచే నాత్మననువు పఱచి
తత్వమస్యాది వాక్యంబు దలపుచేసి
సోహమన నేపు గల్గిన సుమతులకును
పరమసుజ్ఞాన విభవంబు పరిణమించి

వ. ఇట్టి ఆత్మజ్ఞానంబునందు బరగు యాత్రైగుణ్యమార్గంబునం బ్రవర్తించిన వారలు కృతార్థులగుదురు గావున.

మాలిని. నీలసునీరద నిర్మలకాంతీ విలసిత శుభచరిత్రధరిత్రీ
పాలనవతాళిత పంకజరాగా కారరమ్యారుచిరంజితపాదా.

**Colophon :**

ఇతి శ్రీ మదనగోపాల చరణకమల ధ్యానానందపవిత్ర కౌశిక గోత్రపవిత్ర గోపయామాత్యపుత్ర సుజనవిధేయ చెన్నయ్యా వీరయ నామధేయ ప్రణీతంబైన విజ్ఞాన ప్రదీపకయను యోగప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత సుందరముగనున్నది. తప్పులు కొలదిగఁ గలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది నాల్గాశ్వాసముల పద్య ప్రబంధము. యోగశాస్త్ర విషయ మిందు విపులముగ వర్ణింపఁబడియున్నది. గ్రంథకర్త కౌశిక గోత్రజుఁడగు చెన్నవీరయ. గోపయామాత్యునికి బుత్రుఁడు.

గ్రంథాంతమున నిట్లు కలదు—

" రక్తాక్షి సం॥ అధిక చైత్ర శు॥ ౧౩ శే. సరిగా.
గీ. ధరణిశృంగార కవికులోద్భవుడు వెంక
టాహ్వాయుడు పూర్వపద్ధతి నరసిప్రాసె
తేటమీరంగ జ్ఞానప్రదీపకయను
గరిమయోగ ప్రబంధంబు గురుతుగాను "

అని యున్నది.

R. No. 879.

Palm-leaf. Size, 12 × 1¼ inches. Foll. 46. Lines, 7 on a page. Mode of writing, good, contains mistakes and omissions. Condition good. Printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

శ్రీరామ స్తవరాజము.

ŚRĪ RĀMA STAVARĀJAMU

Same work as that described under R. No. 5 ante. The name of the author of this work is Mallanārya, son of Krsnayāmātya.

(టి-వి)—

సమగ్రము. ప్రథమాశ్వాసమునుండియుఁ గలదు. పీఠిక లేదు. ప్రాంత మందివి. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు కలవు.

ఇది ఆర్. నెం 5 రున వర్ణితమైనదే.

కర్త మల్లనార్యుడు. కృష్ణయామాత్య పుత్రుఁడు.

---

R. No. 880.

Palm-leaf. Size, 12 × 1¼ inches. Foll 32. Lines, 4 or 5 on a page. Mode of writing, not good and contains mistakes Condition good. Not printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

First and last foll are left blank.

(a) శక్తి దండకము.

ŚAKTIDAṆḌAKAMU.

Foll. 2-*a*—14-*a*.
A Dandaka written in praise of Goddess Śakti.
Complete.

**Beginning :**

శ్రీమన్మహాశక్తి సద్భక్తిముక్తి జనానందయుక్తిం దురాత్మప్రభుత్వం, (?) జగద్వ్యాపితానైకి లక్ష్మీమహామాయదుఘూనీ, మృడానీ, భవానీ మదోన్మత్త భద్రేభయానా, పరంజ్యోతి, శర్వాణి వాణి (?), శుభ్రశ్రేణి, శర్వాణి నారాయణి, నీలవేణి లసత్కాంచనా దండపాణి సితాంభోజ పాణి.

* * * *

**End :**

దేహంబు ఖర్వులం, మంబులన్ మాన్పి యాహార నిద్రాదులంటట్టగా జేశి దేహంబు మహాబాధల న్నిర్వ్వడంగొట్టి నీదైన ఖండారముంబెట్టు కో చల్లగా కాశికాపాడుమీ భైరవీ సహస్రా పరాధతమకాయుగా యీ భూమిలో సర్వజీవాత్మలంబ్రోవు మీ చండికా నావిన్నపంబో ధరించు, గాముక్తి ఆయస్తుభ్య నమస్తే నమస్తేనమః॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగు లేదు. తప్పులకుప్ప. శైథిల్యగ్రంధ పాతములు లేవు.

ఇందు శక్తిస్తోత్రము దండక రూపముగఁ జెప్పఁబడినది. కర్త పేరెఱుఁగరాదు.

(b) మంత్ర విషయము.

MANTRA VIṢAYAMU.

Foll. 15-*a*—31-*b*.

Some mantras and their applications are described herein.

**Beginning :**

ఈ యంత్రం వ్రాసికట్టుతే పగవానికి నాలుక ఆడదు.




ఓం అనంతా అప్రమేయా ఆదిపురుషా చక్రపాణి పరంజ్యోతి నిగమగోచరా నిత్యకల్యాణివాస భవరోగదైత్యా అసురమర్దనా ఓం నరసింహ్వా లక్ష్మీనారసింహ్వా మర్కటనారసింహ్వా గజనారసింహ్వా హుం నారసింహ్వా ఓం ఫటు స్వాహా!

**End :**

ఓం హ్రాం హ్రీం హ్రూంరతిశ్రయేస్వాహా! సర్వశక్తి విమోహినీ స్వాహా! యక్షిణిమంత్రం. యం అం సం హాం క్రీం తీ మినుములు మంత్రించి గ్రహంపట్టిన మనిషిమీద వేశేది. బెత్తంతో కొడితే గ్రహం విడుచును. యం. సు. సం. వం. యీ బీజములు చాత పండుడు పరి యూషములు మంత్రించి జడవేస్తే గ్రహం స్తంభనం అవును.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగులేదు. తప్పులుకుప్ప. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఇందుఁ గొన్ని మంత్రములు ప్రయోగవిధి సహితముగఁ గలవు. కూర్చినవారెవరో తెలియదు.

---

R. No. 881.

**Palm-leaf.** Size, 14½ × 1⅝ inches. Foll. 47. Lines, 5 or 6 on a page. Mode o. writing, good, contains mistakes. Injured. Not printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

Foll. 1-*a*—19-*b*.

(a) రామప్రభు శతకము.

RĀMAPRABHU ŚATAKAMU

Same work as that described under R. No 396 ante The name of the author is Kāmēśvarakavi

Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

కామేశ్వరకవిచే "శ్రీరామప్రభూ!" అను మకుటముతో భక్తిరసప్రధానముగ నీశతకము రచింపఁబడినది.

ఇది ఆర్. నెం 396 రున వర్ణితమైనదే.

గ్రంథాంతమున—

"క. వ్రాలా శబ్దము తప్పులు
చాలంగల వేమళ్ల సంగతులెఱుగం
యేమియు తిట్ట కనవ్వక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా!

"యీ పుస్తకం పుప్పల వెంకట్రాయుడు కాసు నిమిత్తం వ్రాసినది" అని యున్నది.

Foll. 20-*a*—47-*b*.

(a) భూషణవికాస శతకము.

BHŪṢAṆAVIKĀSAŚATAKAMU. (printed)

Same work as that described under R No 296 (*a*) Name of the author is Śēsācala Dāsa.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

శేషాచలదాసుచే రచింపఁబడి, ఆర్ నెం 296 (a) రున వర్ణింపఁబడిన నరసింహ శతకముకంటె నిది వేఱుకాదు.

గ్రంథాదిని "భూషణవికాశ శతకం ప్రమోదూత సం॥ ఆషాఢ బ ౮ సు॥ రోజున—" అనియును,

గ్రంథాంతమున "ప్రమోదూత నామ సంవత్సర ఆషాఢ బహుళ అష్టమీ శుక్రవాసరం రోజున పగలు రెండు యామాలకు ప్రతిలోయున్న ప్రకారం అప్పల రామయ్య కుమారుడు వెంకట్రాయులు భూషణవికాశ శతకం వ్రాశెను" అనియును గలదు.

---

R. No. 882.

Palm-leaf. Size, 15¾ × 1 inch. Foll. 42. Lines, 4 or 5 on a page. Mode of writing, not bad. Free from mistakes. Injured. Not printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

గీతగోవిందము.

GĪTAGŌVINDAMU

A Śṛṅgāra (Erotic) poem in ten Āśvāsas It is a Telugu rendering of the same work by Jayadēva in Sanskrit The author is Vēnkaṭa-nārāyaṇa, son of Vēṅkaṭapati and grandson of Koṇḍārya

Incomplete.

**Beginning :**

. . . లక్షణాపరిణయ కృష్ణవిలాసాది సంస్కృత ప్రబంధంబులును, మదనగోపాల విజయ రసోత్తరంగిత త్రిలింగ భాషాకృతి ప్రతానంబుల, నుపమోత్ప్రేక్షా ముఖార్థాలంకార వృత్త్యనుప్రాసాది

శబ్దాలంకారభాసిత ధ్వనిగుణీభూత వ్యంగ్య చిత్రవిచిత్రిత ప్రఖ్యాతో
త్పాద్యమిశ్రవృత్త విఖ్యాతంబుగా

*　　　*　　　*　　　*

క. వ్రజయువతీ లోలుకు పం
కజదళవస్త్రాత్త పాంశుకల్లోలునకున్
సుజనకృపాళునకున్ జిత
కుజశిశు . . . . మదనగోపాలునకున్.

సమర్పితంబుగా నాయొనర్పంబూనిన గీతగోవిందాభిధానంబగు
సత్కృతి ప్రధానంబునకు మాంగల్య విధానంబు శుభకథా . . .
నంబు నెవ్విధాన బ్రవర్తిల్లెననిన—

*　　　*　　　*　　　*

**End :**

క. మస్తూరీకృతలోలా
కస్తూరీతిలకఫాల కంసవిఫాలా
మస్తకభృతశిఖిబాలా
హాస్తకలిత వేణునాళ హాటకచేలా.

లయగ్రాహి—తామరస . . . . విరోచన సు
తామరవిమోచన నిజానుసగుణశ్రీ
తామయ విమోహక . . యావిదాహకహ
తామగ సముహాకభృ తామరగుణాళ్యే
తామసత . . . . . .

**Colophon :**

ఇతి శ్రీమదనగోపాల కృపాల హాస విశంకట కటాక్షవీక్షా సమా
సాదితయశో దక్షను లలితకవితాలతాలవాలతాభాసి వాసిష్ఠవంశకీర్తి
ప్రతిష్ఠా సంపాది ఋగ్వేదిరామదీమతకుమార తిర్మల సుధీమణి సుధాజల
నిధానకల్పతరువదప్పకొండార్య వరపౌత్ర వేంకటపతి సుకవిపుత్ర చిత్ర
భాషా విరాఘాట నాటకాలంకార మర్మకర్మ బ్రహ్మవాదితా కుమారిల
కులకుమార కవిరాజకంఠీరవ బిరుదాంక వేంకటనారాయణార్య ప్రణీ
తంబైన గీతగోవింధాభిధాన కృతిప్రధానంబునందు అనాగత నాయిక
ణంబను సప్తమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత చెడ్డదికాదు. మొదటఁ గొన్ని పత్రములును, చివరి పత్రమును లేవు. తప్పులు లేవు. శైథిల్యము బాగు గలదు. గ్రంథపాతములు లేవు.

ఇది పదియాశ్వాసముల శృంగార ప్రబంధము. జయదేవ మహాకవిచే సంస్కృతమున రచింపఁబడిన గీతగోవిందమున కిది తెలుఁగుసేత. వసిష్ఠ గోత్రుఁడును, ఋగ్వేదియునగు వేంకటనారాయణార్యుఁడు దీనికిఁ గర్త. అతని తండ్రి వేంకటపతి. తాత కొండార్యుఁడు. ఈ గ్రంథము కవికి ఇష్టదైవమగు మదనగోపాలస్వామి కంకితమొనర్పఁబడినది.

---

R. No. 883.

**Palm-leaf. Size, 14¼ × 1¼ inches. Foll. 34. Lines, 5 or 6 on a page. Mode of writing, good, but not free from mistakes. Condition good. Not printed.**

Presented in the year 1928 by the Maharaja of Pithapuram.

గురుశిష్య సంవాదము.

GURUŚIṢYA SAMVĀDAMU

Same work as that described under R. No. 98. The name of the author of this work is Yōgānandāvadhūta.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. కన్నడమోడిగానున్నది. తప్పులు కలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

వేదాంత విషయప్రతిపాదకమగు నీగ్రంథమును యోగానందావధూత రచించెను

ఇది ఆర్. నెం 98 రున వర్ణితమైనదే.

గ్రంథాంతమున—

"యాదృశం పుస్తకం దృష్ట్వా తాదృశం లిఖితం మయా। అబద్ధం వా సుబద్ధం వా మమదోషో న విద్యతే" అని యున్నది.

R. No. 884.

**Palm-leaf** Size, 12½ × 1½ inches. Foll. 28. Lines, 5 or 6 on a page. Mode of writing, good, contains mistakes Condition good. Not printed.

Presented in the year 1928 by the Maharaja of Pithapuram

రామ దండకము.

RĀMADAṆḌAKAMU

A Daṇḍaka describing briefly the story of the Rāmāyaṇa. The author is not known

**Beginning :**

శ్రీమానినీ చిత్తచోరా శుభాకారవీరా జగద్దేతుసామప్రకారా సమస్తంబునీవై సదాసాక్షివైయుండి లోకంబులో కొన్ని రూపంబులం దాల్చి నానేకముఖ్యాది . . . లకుం బ్రీతిగావింపగా మత్స్యకూర్మాది రూపంబులందాల్చి రాకాసులకా శిక్ష గావించి యామీద రామావతారంబునన్ రావణుండాదిగా రాక్షసానీకముల్ జంపినావంచు వాల్మీకి రామావతార ప్రభావంబు సాంగంబుగా జెప్ప త్రైలోక్య విఖ్యాతి

* * * *

**End :**

రాఘవా రామభద్రా భవన్నామ చారిత్రమెంచంగ నే నెంతవాండన్ సదాసత్య వాక్యాంబుదాసార సద్గుణ్యసాంద్ర దశగ్రీవ వంశాటవీ వీతిహోత్రా మహారాజ చూడామణీ సూర్యవంశాగ్రణీ నీవు నాచోట కారుణ్య తాత్పర్యమున్ సల్పి మోక్షంబు సూత్మంబుగానిచ్చి మన్నించు దేవా నమస్తే నమో దుందుభీవత్సరంబందు శ్రావణ్యమాసాన యీ శుద్ధ దష్మిందు వాసరంబందు శ్రీరామచారిత్రమున్ చెప్పి పూర్దంగా దండకంబొప్పగా నీకు రామార్పణంగా సమర్పించితిన్నీవు నాచోట కారుణ్యమున్నుంచు . . . .

(వి-వి.)—

అసమగ్రము. తుదిపత్రము లేదు. వ్రాంత చెడ్డదికాదు. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఈ దండకమున రామాయణ కథ సంగ్రహముగ వర్ణింపబడినది. అసమగ్రమగుటచేం గర్తపేరెఱుంగ వీలులేదు. ఇది దుందుభి సంవత్సర శ్రావణ శుద్ధ దశమి సోమవారమున ముగింపబడినట్లు దండకమునందే చెప్పబడియున్నది.

R No. 885.

Palm-leaf Size, 12¼ × 1⅝ inches. Foll 134. Lines, 6 on a page Mode of writing, fair but not free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

## కన్యకా పురాణము (ద్విపద).
## KANYAKĀ PURĀṆAMU (DVIPADA)

A rendering in Dvipada of the prose work described under R No 185 ante The author is Pullakavi of Koṇḍavīdu, son of Giryapārya and Vengamāmba

**Beginning :**

శ్రీమన్మహీజగంజితదివ్యతేజ
నామోదముగ వక్షమందు నధ్యక్షు
లీలాప్తిగాఁగౌగిలించి సదోక్యగి
పాలనుండను ఘాటిఁబరగినమేటి
కాకుత్స్థకులజుఁడు ఘననిభాంగుండు
సాకల్యగుణి రామచంద్రుండు ప్రేమ
నాయురారోగ్యంబు లరయమాకొసఁగి
మాయింట నెలకొని మమ్మేలుఁగాత !

* * * *

విపులభాషాభూషు విద్యావిశేషు
వాగనుశాసను పరతిక్కయజ్వ
బాగుగ వినుతించి బహు సంస్కృతాంధ్ర
కవులకుఁ గైమోడ్చి కాకవిప్రకర
మవశంబు గావించి యతిశయానంద
మనువందఁ జెలువంది యాంధ్రప్రబంధ
ఘనతరంబగు కన్యకాపురాణంబు
లలిమీఱ నవరసాలంకార రచన
విలసితాంధ్రమున నే ద్విపదగావింతు
కలితసద్గుణుల సత్కవి శిఖామణుల

* * * *

రహిఁగన్ననగరేశ్వరస్వామి మహిత
విహితభక్తులనంగ విని వెన్నదొంగ
యగు జనార్దనమూర్తి కమితవిస్ఫూర్తి
జగమందుపొగడి నిశ్చలమానసముల

సవరణగాఁగ వా సవకస్యధస్య
నవిరళస్ఫురణతో నర్థిసేవించి
మిలమిలనగు వొంనె మెరయుంగమిథున ?
కులగోత్రవిభవాను గుణ్యసాద్గుణ్య
గణ్యులై బలువేడుకకు గుమ్మటవారి
పుణ్యపూరుషులనై పుణ్యాంబ నేను
పెంపొందగానెంతు పృథ్వీతలమున

* * * * *

భారతీవినుత శోభారతిప్రతిభ
ధారాళముగ సుధాధారలాలరంగ
తమ్మిపూరుమ్మి యుందవు తమ్మిశెట్టి
కొమ్మవెంగమ్మ కొంగుపసిండిబొమ్మ
సిరిదొళఁగాంచి పెంచిన కుమారుండు
గురువర్ధమణి (?) వాని కులకాంతసరస
వాచావిచక్షణావహ మోహనాంగి
రాచమ్మవారిర్వురకు తనూజన్మ
లాలిగాంచిన పుణ్యలోకపీకచేత
పాలింపదగిరి ముప్వురు పోలిశెట్టి
యనువాడు జగ్గయామాత్యుఁడు సుబ్బన్న
యనగ నచ్చమనందమాంబ లింగమ్మ
యనుగు పార్వతిలక్ష్మి యలివేణివాణి
పోణిమిజొందిరప్పుడు లింగమాంబ
రాణిగా నారాజరాజ సన్నిభుని
రామణీయక గుణగ్రామ శ్రీరాము
నేమించిపేమించి నిరుపమప్రేమ
రామునిబోల్పుత్రరత్నంబు గనియె
నా ముద్దుగుమ్మ గర్భాబ్ధిచంద్రుండు
కీర్తింప వాణిజ్య కృషిగోవితాన
వర్తన రక్షణా వార్యవర్యుండు
గాముడుజ్జ్వల పుత్రరత్నంబునంగ
కామించి యోంబళాంబా చంద్రవదన
యుండు ముప్వుర . . .
కందళించిన ప్రేమగా ముద్దుకొడుకు

ఎఱుక గల్గినవాడు యెఱుకల శెట్టి
సంచురాయంచు ముచ్చట లిచ్చగించు
చెంచు శెట్టి వివేకశాలి వీరప్ప
లిటులెంచదగి యుండిరి డిప్పబడిన(?)
ఘటనాఘటక కార్యఘనులలో మేటి
యెరుకల ఘనురాణియింతి యెల్లమ్మ
ధరనెన్న చెంచన్న తరుణి నాగమ్మ
వీరప్ప సతి సద్వివేకి సుబ్బమ్మ
నిందందగించిన యీసుతత్రయము
నందుమ పుత్రుడగు చెంచుఘనుని ?

కనుగుణంబుగబుట్టి రనఘాత్ములగుచు
గొనకొన్న నెనరుతో కొడుకులు మువురు
పరికింప హరిహర బ్రహ్మలున్నట్లు
విరుదాంకులైగి గంభీరరూపముల
కులమువన్నెకు నెక్క కూతురొక్కర్తు
లలిని సుబ్బమగుణాలంకారయవ్వ
తొలుతటి సుతుడు సంతోషముప్పొంగ
నెలకొని పెదతండ్రి నెనరుతోననుగు
కొమరుడై తమ బందుగులలో వెంకన్న
కొమెరపాయపు ముద్దుగులు కంగబెదిగె
నాణిముత్యములట్లనతని సోదరులు
రాణించి మించిరి రామలక్ష్మణుల
లక్షణంబులుగల్గి లక్ష్మీకటాక్ష
వీక్షణంబులను తీవిగ సుబ్బఘనుడు
తమ్మిశెట్టి యనేటి తనయుండు మేటి
మాటవాసిగ బుద్ధిమది గాంచి ప్రబలె
మాటయేబంద్రము సన్నుతిసేయుచుండ
తతకీర్తిగా వారి తల్లిదండ్రులకు
కుతుకంబులొనగి పెకుగలవర్ధిలంగ
నవుడెంచినది రామయశెట్టి వేటక
లుపమింప ననుగాంచి యొగి నుత్సహించి
నులిలేని కరుణకన్నుల గారవించి

ప్రియము రెట్టించంగ బిలిచి యిట్లనియె.
కలితాంతరంగ సంగతకొండమడుగు
కులశిఖామణివి మకుటవగిర్యపాగ్య
మగువ పతివ్రతామణి వెంగమాంబ
గాంచి పెంచిన పుల్లకవికీర్తి బలిసి
ప్రాంచిత ప్రవణభారద్వాజగోత్ర
మందుద్భవిలిన విద్యావ్యాద్యనిధివి
విందవైమాకు శీవిగ గనుపింప
బరతెంచినావు శోభనకళాకలిత
సరసగీర్వాణాంధ్ర సాహిత్యనిధివి
కరమర్థిమై కన్యకా పు—ణా—బు
తరముగా మాకంకితంబుగావించి
నిగా ంచుమని సన్మనీషావిశేష (?)
భగవతీ వాసవాంబా కటాక్షంబు
సమపూర్ణమనుచు వస్త్రవిభూషణాదు
లమితంబుగాగ నందండకర్పూర
తాంబూలమొసగి యంతట నాదరించి

* * * *

**End :**

తల్లడించుచు నిచ్చఁదపింతపాగొనుచు
తల్లిదండ్రులఁబాసి తమ పిల్లపాప
లన్నదమ్ములఁగాన కపుడు చీకాకు
గొన్న చిత్తములతో గొబ్బునఁజనిరి
అని శౌనకాదుల కానూతుఁడాది
మునిశిఖామణి యశోభూషణుండనఁగ
లలిఁగాంచినట్టి సాలంకాయనుండు
లలిత లక్షణగుణాలంకారలీల
మోదంబుతో వైశ్యమునులకానాఁడు
సాదరంబుగఁజెప్పినట్టి సత్కథన.

* * *

కారణబ్రహ్మ ప్రకాశుని పేర
గౌరీపరీరంభ కలితానురాగ
నిలయుని పేర మానిజనాంతరంగ

విలసద్రుచి పదారవిందుని పేర
నిగమగోచరు పేర నిరవద్యహృదయ
నగరేశ్వరుని పేర నవరసస్ఫురణ
భరణభాషాసుధా ప్రవణానురూప
కవివరస్తుత కన్యకా పురాణంబు
శ్రీకంభగిరి నారసింహాంఘ్రిపద్మ
సాకల్యసేవా విచక్షణాక్షీణ
మహనీయ మతికొండమడుగు సద్వంశ
విహితసంభవ కళాన్వితగిర్యపార్య
మణి సతీవెంగమాంబా గర్భశుక్తి
మణిపుల్ల కవిసుధామయ వాకచక్య
వాక్యవైఖరులచే వర సంస్కృతాంధ్ర
శత్రైక్యధోరణీ చాతుర్యధుర్య
మాధుర్యములు చిలుకమతిమంతుడైన
సాధువిద్వత్కవీశ్వరు లిచ్చ మెచ్చ
నరసుతంబుగఁజేసె నవరసస్ఫురిత
భరితమై పరమ సౌభాగ్యయోగ్యముగ
తతలీల నాచంద్రతారార్కమగుచు
నతులితంబై తృతీయాశ్వాసమయ్యె
శ్రీకంభగిరి నృసింహార్పణమస్తు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఆర్. నెం 185 రున వర్ణితమైన కన్యకాపురాణ కథ కిది ద్విపద రూపరచనా భేదము. కర్త కొండమడుగు పుల్లకవి. వెంగమాంబా గిర్యపార్యుల కుమారుఁడు. భారద్వాజగోత్రుఁడు. కంభగిరి నృసింహ స్వామి భక్తుఁడు కృతిపతి రామయసెట్టి యను వైశ్యవర్యుఁడు. కృతిపతినిగూర్చి విశేషములకు దాహృత గ్రంథభాగముఁగాంచునది.

---

R. No. 886.

Palm-leaf. Size, 12 × 1½ inches. Foll. 36. Lines, 5 on a page. Mode of writin . fair but not free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928

ఛందోవిషయము.

CHANDŌVIṢAYAMU

A collection of verses taken from Kavijanāśrayamu, etc., bearing on Telugu prosody.

Incomplete.

**Beginning :**

క. శ్రీకాంతాతి ప్రియవా
క్ప్రీకాంత జగత్త్రయైక సేవితసుత వి
ద్యాకాంత దివ్యకావ్యస
దేకాంతనితాంతకాంతి నీవుత మాకున్.

గీ. చంద్రవహ్నిసూర్య చక్షుండౌ రుద్రుండు
మూఁడుగన్నులందు మూఁడుగురువు
లుదయమయ్యె దాననొప్పారె మగణంబు
నందు సప్తగణముల మరఁబుట్టె.

**End :**

శ్రావకాభరణాంకవిభా రసజాభరేఫలదీనిరా
మానవహంబు గమత్తకోకిలయండ్రు దీనిఁగవీశ్వరుల్.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

కవిజనాశ్రయాది లక్షణగ్రంథములలోని పద్యములు సంకలన మిది. పలులక్షణ గ్రంథములలోని లక్షణలక్ష్య పద్యములిందుఁగలవు. ఇది యానుపూర్విగల గ్రంథముగాదు. ఛందఃకావ్య లక్షణాది జ్ఞానమునకై యెవరోకూర్చి పెట్టుకొన్న పద్యసంగ్రహము.

---

R. No. 887.

Palm-leaf. Size, $15\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches. Foll. 8. Lines, 7 on a page. Mode of writing, fair, contains mistakes. Injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

ద్వారక వేంకటేశ్వర శతకము.

DVĀRAKA VEṄKAṬĒŚVARA ŚATAKAMU.

Same work as that described under D. No. 1719 ante. Name of the author is not known.

Incomplete.

బి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములుగలవు.

ఇది క్రీ. శం 1719 రున వర్ణితమైనదే.

---

R. No. 888.

Palm-leaf. Size, $16\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches. Foll. 18. Lines, 5 on a page. Mode of writing, fair but contains mistakes Injured. Not printed

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

ప్రసన్న వేంకటేశ్వర విలాసము.

PRASANNAVĒṄKAṬĒŚVARAVILĀSAMU.

A Yaksagāna describing the marriage festival of God Venkatēśvara worshipped at Rāyadurga, the headquarters of the Vijayanagara kings. The author is Daḷavāyi Timmabhūpāla, son of Vēnkatadharādhipa and Laccama, and a disciple of Vīrarāghavaguru.

Incomplete.

**Beginning :**

ఉ. శ్రీయువతీ మనోహరు నశేషజగత్పరి పోషణక్రియో
పాయధురీణు కల్మష విభంజను నారదకుంభ జాత్రిగా
ధేయసురాధి నాయక విధిప్రముఖార్చిత పాదపద్ము శ్రీ
రాయగిరిప్రసన్ను బుధరక్షకు వేఁకటనాథు గొల్చెదన్.

వ. అని మగినేన్నిమని వర్ణింపుచున్నాఁడు.

నాట—జంపె.

సరసకీర్తివిశాల సమదాసురవిఫాల
శరధికన్యాలోల జనకనృపాల
నిరతధర్మావాల నిగమవర్ణితశీల
శరవిఖండితతాల సత్యమయశీలా ॥ప॥

శరణూ.

*   *   *   *

అని యిష్టదేవతా ప్రార్థనంబు చేసి కవీశ్వరుం డీక్షితి కధీశ్వరుం డైన ప్రసన్న వేంకటేశ్వరునకు షష్ఠ్యంతములు రచియించెనటూ, ఎటువలెను.

త్రిపుడ రేకులు—శంకరా భరణం. నాట్యపద్ధతికి గాళిపంతు (ఆది).

కమలదళనేత్రునకు భంజితకల్మషవ్రజునకు మదా
సురదమనునకు ప్రసన్న వేంకటరమణునకును.

* * * *

వ. అంకితంబుగా నొనర్పంబూనిన ప్రసన్న వేంకటేశ్వర విలా
సంబను యక్షగానంబునకుఁ గథా క్రమం బెట్టిదనిన—

జంపె—కల్యాణి.

గణుతింపసకల శృంగార రసబంధురము
రణరిపుభయంకరము రాయాద్రిపురము.

* * * *

కేదార గౌళ.

ద్విపద.

ఆ పట్టణంబున కధిపతియైన
భూపాలవర్యుఁ డద్భుత షూరాక్రముఁడు
నిత్యప్రసన్నుండు నీతిపారగుడు
సత్యసదాచార చతురవర్తనుఁడు
కర్ణాటకటక దీక్షాదక్షునుగ్ర
వర్ణదక్షుణుఖండ్ర వైభవోన్నతుఁడు
ముదిమిమీరినహత్తు మువ్వరగండ
డెదురెన్నరాని హన్నిబ్బరగండ
డురుకీర్తి ధౌరేయుఁడుగ్రవిరోధి
నరపాలబృందపన్నగ ఖగేంద్రుండు
సరసగాంభీర్యుఁడు సగస నిశ్శంక
బిరుదాంకు డఖిలదిగ్విజయశీలుండు
లలిమించుకర్ణాటరాయ దళ్వాయి
కులశేఖరుఁడు మేటికోనేటి నృపతి
కర్ధాంగి యైనవిట్లాంబికా గర్భ
వార్ధిచంద్రుండనవసుధ నల్దెసల
గణుతింపఁదగిన వెంకటధరాధిపుని
పణతియౌలచ్చమాంబా నందనుండు
కరుణా విధేయుండు . . . .
బిరుదాంకుఁడైధాత్రి బెంపువహించి

కోటికన్యాదాన కుశలతనలరి
యేటూరి పురమున నింపొంద వెలసి
నట్టి తిర్మల తాతయాచార్యముద్దు
పట్టియౌ వేంకటవరదదేశికుని
తనయుఁడై కాంత వర్తనుడననలరి
ఘనుడైన వీరరాఘవ గురుకృపను
స్థిరతరైశ్వర్యంబు శ్రీహరిభక్తి
పరమవిజ్ఞానంబు ప్రకటింపఁగాంచి
ధరణి చెల్వొందు శ్రీదళవాయి తిమ్మ
నరనాథుకర్థిపన్నగశైలధాము
నెలమి సద్భక్తిచే నెప్పుడుసేవింప
నలరి వెంకట నాథుఁడతని భక్తికిని
అలమేలుమంగతో నానంద లీల
వెలసి రాయద్రిలో విహరింపదలచి
అరుదైన దేవాలయంబున నిలచి
వరుసతోన రథోత్సవముల చేబొల్చి
గరిమ ప్రసన్న వేంకటనాథుఁడనగ
నిరవంద భక్తుల నేలుచునుండు

వ. ఇట్లుండెడు దేవదేవుండొక దినంబున శృంగార మవధరించె నటా, ఎటువలెను.

* * * *

ఉ. కంటికి నిద్రరాదు తపకం బెదనిల్వదు నాదు జిహ్వకున్
వంటక మిందదన్య సఖివై . . . . చెట్టవా
ల్గంటిని చూచినన్ . . . . ప్రొద్దుబోదునా
వంటిల తాఁగి నేచగ కృపాకరనీమన సెట్టులో చెనో॥

* * * *

మందరోద్ధారునికి సౌందర్యకామునికి
మందారధారునికి మంగళం.

**End :**

ద్విపద. అనివిశ్వ విశ్వంభరాధ్యక్షుపేర.

* * * *

వనమాలికాంచిత వక్షునిపేర

నను . . . . .
హారిపేర శేషాచలాధీశు పేర
సమరారిదానవ సంహారు పేర
కమనీయరాయదుర్గ విహారి పేర.
శంకరప్రియు . . . . . .
* * * *
ధరబుక్క రాయ సముద్ర . . .
* * * *

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంతమంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములుగలవు.

విజయనగర రాజుల రాజధానియగు రాయదుర్గమున వెలసిన ప్రసన్న వేంకటేశ్వరస్వామి కంకితముగా తత్కల్యాణోత్సవవర్ణనాత్మకముగు యీ యక్షగానమును ఆ రాయదుర్గమున విజయనగర రాజ్యపాలకుడుగానున్న (అరవీటి ?) కోనేటిరాయల కుమారుడును వెంకటధరాధిపునికిని లచ్చమకును కుమారుడును, తిరుమల తాతాచార్యుల కుమారుడగు వరద దేశికుని పుత్త్రికగు పేరమ్మవకు రుంటి, శిష్యుడును నగు దళవాయి తిమ్మ భూపాలుడు రచియించెను. విశేషముగ కు దాహృతగ్రంథ భాగముగాంచునది.

---

R No. 889.

Palm-leaf. Size, 14½ × 1½ inches. Foll. 64. Lines, 5 or 6 on a page. Mode of writing, good but not free from mistakes. Injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

ప్రబంధ రాజీయము.

PRABANDHARĀJĪYAMU.

Incomplete

Same work as that described under D. No 572. The name of the author is Ganapavarapu Venkatakavi.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు గలవు.

ఇయ్యది డి. నెం 572 రున వర్ణితమయినదే. కర్త గణపవరపు వెంకటకవి.

## R. No 890.

Palm-leaf. Size, 13⅜ × 1½ inches. Foll. 33. Lines, 5 on a page. Mode of writing, good, almost free from mistakes. Slightly injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

గయోపాఖ్యానము.

GAYŌPĀKHYĀNAMU

This is probably a portion from the Bhārata dvipada It contains the story of Gaya The name of the author is not known.

Incomplete.

**Beginning :**

. . . దండప్రణామంబు దగనాచరించె
నిండుసనంబున నిలిచి యిట్లనియె
జగతీశ యిపుడు వసంతకాలమున
చిగురించె న ద్యాన సీమ భూజములు
పూచెఁబాటలములు పూచె సంపెఁగలు
పూచెఁ బున్నాగముల్ పూచెఁ జాతములు
పూచె సిందురములు పూచెఁ బూగములు
పూచె నారదములు పూచె మోదుగులు
కన్నులపండువై కరము శోభిల్లు
చున్నదిప్పుడు చూడ ముద్యానవనము
మనసిజగురుడంత మదినుత్సహించి
ఘనమైన పచ్చల కడియంబులిచ్చె.

**End :**

ఘనతర సంతోష కలితుఁ గావించె
మహిమతో నాశతమఘతనూభవుని
బహుముఖంబులఁ బద్మభవుఁడు . . యించె
తనవేయుఁ గన్నుల తనయు . . .
తనివోందఁజూచె బృందారక విభుఁడు
మునిసిద్ధదేవ సమూహంబులెల్ల
వినుతించిరందందు దివ్వచ్చుఁ జూచి
హరుడును బ్రమథ బ్రహ్మాదులతోడ
నరిగె వేడుక రజతాచలంబునకు
పాండవాగ్రజుఁడును బరులజయించె
మండితకీర్తి భూమండలి వెలసె

విశ్వసుంధరలోన నీ పుణ్యచరిత
మెవ్వఁడు చదివిన నెవ్వఁడు విన్న
నాయు రారోగ్యంబు లధిక సంపదలు
నేయెడఁ బొందును నింపుసొంపారఁ.

(వి-వి.)—

అసమగ్రము. ఆరంభ భాగము లేదు. వ్రాఁత చక్కనిది. కన్నడ మోడికలది. తప్పులంతగా లేవు. శైథిల్యముకలదు. కొలఁదిగా గ్రంథపాతములు గలవు.

భారత ద్విపద రచనములోని భాగమైయుండు నేమో? గయోపాఖ్యానకథయిందుఁగలదు. కర్తపే రెఱుఁగరాదు.

---

R. No. 891.

Palm-leaf. Size, 15 × 1⅝ inches. Foll. 122. Lines, 7 or 8 on a page. Mode of writing, fair and free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

(a) ముక్తికాంతా పరిణయము.

MUKTIKĀNTĀPARINAYAMU

Foll. 1—50.

A poem in three Āśvāsas on the Advaita system of philosophy. The author is Vēgmāṭi Kondaya He says that he completed the work in seventy-two days.

Complete.

**Beginning :**

శా. శ్రీమచ్ఛ్రోత్రరమా విశోదవహరిన్ జిహ్వాంది నిత్యోన్నవ
శ్రీమంజు ప్రభలన్ సహస్రదళరాజీవాంతరా సీనుఁడై
ప్రేమన్ భక్తుల బ్రోచువేడుకమదిన్ బెంపొందు వేదాంత వి
ద్యామూర్తిన్ గురుఁ దాపసాశ్రయుని దత్తాత్రేయులంగొల్చెదన్.

* * * *

మ. ఘనువాల్మీకినుతించి వ్యాసునకు వేడ్కన్ మ్రొక్కి బాణున్ మయూ
రుని మాఘున్ గవికాళిదాసులను నేర్పొప్ప మెచ్చఁగీర్తించి భీ
ముని శ్రీనాథుని సోమయాజులను సోమున్ నన్నపార్యున్ యశో
ధనుఁడౌ బమ్మెర పోతరాజు మొదలౌ ధన్యాత్ములన్ గొల్చెదన్

చ. కవులమటంచుఁ గాకవులు కాఱులుపల్కుచు సత్కవీంద్రులన్
బ్రవిమలయుక్తులం గృతులపారవిభూతిఘటింప నందుతోఁ
దవిలి కుయుక్తులం గడఁగి తప్పుల నెన్నుచుఁ గాని తద్వచ
స్సరణసారముం దెలియఁ జాలరు వారిఁ దిరస్కరించెదన్.

* * * *

వ. అందు షష్ఠ్యంతావతారం బెట్టిదనిన.

శా. శ్రీమద్వృష్ణి కులాబ్ధిచంద్రుఁడు యశశ్శ్రీ రాజితప్రాభవ
శ్రీముం డార్యనుతుండు బాంధవ జనశ్రేయఃప్రదుం డాగమ
ప్రామాణ్యైకవిచక్షణుం డనఘుఁ డాపస్తంబ సూత్రుండును
ద్దామప్రస్ఫుటకార్యసిద్ధములచే ధన్యుండు దా రుండిలన్.

శ్రీవత్సగోత్ర సత్కుల
పావనుఁడౌ బండ్లపల్లి భవ్యాన్వయ సు
శ్రీవేగినాటి ఘనుఁడు బు
ధావనుఁడన వెలసె నాగయామాత్యుఁ డనన్.

క. ఆ మంత్రివరుని ప్రియసుతు
లై మించిరి పాపరాజు నతనివెనుక స
ద్ధాముఁడగు బైచరాజును
శ్రీమండితులై ధరిత్రిఁ జెలఁగిరి వేడ్కన్.

గీ. వారలిరువురలో ధర్మవర్తనుండు
పరమశాంతుండు సుజనసంభావ్యుఁడైన
పాపరాజుకు లోకమ్మాంబకు సుపుత్త్రుఁ
డనఁగ నాగప్రధానుఁడు నవతరించె.

గీ. పరమ శివకృపాత్ముఁ డపారనీతి
ధనుఁడు నాగప్రధానుఁడా వరముతోడ
వార్తకెక్కిన కూడాల వారియింటఁ
గూర్మిఁబరిణయ మయ్యెను గొమరుమిగుల.

శా. ఆ కూడాల వరాన్వయాభరణుఁడున్ ఆర్యానుమోదక్రియా
స్తోకప్రాభవుఁడున్ యశోయుతుఁడు సుశ్లోకుండు గాంభీర్యుఁడున్
పాకారిప్రతిమాన భోగవరుఁ డాపస్తంబ సూత్రుండు లో
కైకస్తుత్యుఁడు <u>పెద్దనార్యుఁడన</u> విఖ్యాతుండు ధన్యుండిలన్.

క. కౌండిన్య గోత్రుఁ డార్యుఁడు
ఖండితరిపు దుర్మదుండు కమనీయ శ్రీ
మండితుఁడు దాన శీలుఁడు
పండిత పాలనపరుండు భాగ్యోదయుఁడున్.

క. ఆ పెద్ద నార్య వరసుతు
లైపరగిరి కోనమంత్రి యనఁ దద నుజుఁడున్
రూపజితా నంగుఁడును
దీపితుఁడా వేంకటార్య ధీవిలసితుఁడున్.

క. ఆయిరువుర కగ్రణియై
ధీయుక్తిఁ బతివ్రతా విధేయయనగుణా
స్థాయిని దీనావన స-
ధాయిని వెంగమ్మ యతిముదమునవగించెన్.

క, ఆమిథునమునకుఁ బుట్టితి
మే మిరువుర మందులోన హితపుణ్యుండై
క్షేమంబున నగ్రజుఁడు
ద్ధామయశుఁడు లింగయప్రధానుఁడు వెలసెన్.

క. తదనుజుఁడ సజ్జనోత్తమ
పదయుగళార్చన విధాన పరతంత్రుఁడనై
విదితంబుగ వర్తింతును
పదపడి కొండయయనంగఁ బరగుచు ధాత్రిన్.

*　　　*　　　*　　　*

క. నేసేసిన భాగ్యంబున
వాసిగ శ్రీరాఘవస్తవంబున మహితో
ల్లాసంబగు ముక్తివధూ
భాసుర పరిణయమనంగఁ బ్రస్తుతమయ్యెన్.

*　　　*　　　*　　　*

మ. అనుకంపాతిశయంబునన్ గడఁగి దత్తాత్రేయయోగీంద్రుఁ
డొయ్యనగంభీరని నాదమొప్పఁగలలో నాకాశరూపంబునన్
ఎనయన్ డెబ్బదిరెండు నాళ్లకు నీవిముక్తికాంతావివా
తన కళ్యాణముఁ జెప్పుమన్నమది నెంతన్ అద్భుతంబందుచున్

క. వాచావీచీ సమకస
మై చెలఁగుచు సర్వమంగళాస్పద మగుచున్
ఆ చంద్రార్కము గాగను
భూచక్రమునందు మిగులఁ బూజ్యతనొందున్.

క. శ్రీ దత్తాత్రేయులు మును
సాదరమున నానతిచ్చు చాడ్పున డెబ్బై
మీదమటి రెండునాళ్లకు
మోదంబున నీ ప్రబంధమును నెఱవేర్చెన్.

శా. ధీవిశ్రాంత కృతాంతశాంత సదనాదివ్యాంతర భ్రాజిత
ప్రావీణ్య స్ఫుటరాజయోగఘటనా పారీణవిద్యావిలా
లావిర్భూతశుభావహా ప్రకటయోగాఖ్యానధౌరేయమా
యావైముఖ్యవిహీననిశ్చల నిరాయాసప్రమోదాత్మకా!

క. షడ్వర్గతిమిర భాస్కర
షడ్విధలక్ష్యావధాన సకలాధారా
షడ్వదనప్రముఖార్చిత
షడ్వనజాతీత యుపనిషత్పథనేతా!

మాలిని.

జగదవనవిలాసా చంద్రికా మందహాసా
నిగమవినుత చర్యా నిశ్చలజ్ఞాన ధుర్యా
గగనమయశుభాంగా గర్భితాత్మప్రసంగా
అగణితరుచిసాంద్రా అత్రిగర్భాబ్ధిచంద్రా!

**Colophon :**

ఇది శ్రీ దత్తాత్రేయగురు బ్రహ్మకృపాలబ్ధకవితా విచిత్ర శ్రీవత్సస గోత్ర పవిత్ర వేగినాటి వంశ పారావారనిశాకళత్ర నాగయామాత్య పుత్ర సుగుణధుర్యకొండనార్య ప్రణీతంబైన ముక్తికాంతా పరిణయం బను మహా ప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

అద్వైత వేదాంత విషయమయిన మూడాశ్వాసముల యీ ప్రబంధము వేగినాటి కొండయకవి రచియించినది. దత్తాత్రేయగురున కిది యంకితము సేయఁబడినది. డెబ్బదిరెండు నాళ్లలోఁ గవి దీనిని రచియించెనట.

(b) వివేక చింతామణి.

VIVĒKACINTĀMANI. (Not printed.)

Foll 51-*a*—81-*b*

The work is also known as Sakalavēdādi Śāstranirṇaya. It deals with the Advaita system. The author is not known.

Complete

**Beginning:**

శ్రీ తిరువేంగళావధూత గురవే నమః.

వేదాంత వచన టీకు.—శ్రీ మదనేకలోక హితమానట్లుగా వేద శాస్త్రపురాణములలో నియమింపఁబడిన విశ్వ విషయంబులను స్థితి యును వివేక చింతామణియను వచన టీకయను విహిత నామంబిడి మహాకవితా ప్రబంధము ప్రేమతోఁ జెప్పెదనేను దీని పాలించి వినుము పురాణ పురుషా—శ్రీ మదనేక భువన భవనారంభ మూలస్తంభ రూప శివాద్యవధూత తిరువేంగళదేశికోత్తమ పర్యంతంబైన గురు పరంపరకు మనోవాక్కాయ కర్మంబులచేత అభివందనంబు లాచరించి

**End:**

ప్రత్యగాత్మాభిరతిచే తత్త్వ మస్యాది మహా వాక్యార్థ విచారము దానిచే అద్వైత జ్ఞానము దానిచే నవిద్యా నాశము దానిచే ద్వైత భ్రాంతినాశము, అందుచే శుభాశుభ బుద్ధి పరిత్యాగము అందుచే రాగ ద్వేష నివృత్తి దానిచే విధి నిషేధ నిరసనము, దానిచే పుణ్య పాప క్షయము, దానిచే అహంభావ వినాశము, దానిచే సర్వపాప విమోచన ము, అందుచే సర్వోత్కర్షమై చరమస్థానమైన పునరావృత్తి రహితమైన సకల శాస్త్ర పర్యవసానమగు నామ రూప క్రియా వాసనఁ జోరక మనో వాచామగోచరమయిన నిత్యానంద స్వరూపమయిన విదేహ కైవ ల్యమానని నిశ్చయించెడి శ్రుత్యాచార్య సిద్ధియౌను.

**Colophon:**

ఇది సకల వేదాది శాస్త్రార్థ నిర్ణయం సంపూర్ణం.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సకల వేదాది శాస్త్రార్థ నిర్ణయమని నామాంతరములుగల యీ వచన గ్రంథము అద్వైత వేదాంత ప్రతిపాదకము. కర్తపేరెఱుఁగ రాదు.

గ్రంథాంతమున 82 a నుండి ప్రభులింగ లీల (కన్నడము) 99 a కొన్ని తెలుగు పాటలు, 115 a 119—122 పాముమంత్రములు, కొన్ని కన్నడ పాటలును గలవు.

R. No 892.

Palm-leaf. Size, 14 × 1¼ inches. Foll 56. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Slightly injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928.

శ్రీరామ స్తవరాజము.

ŚRĪRĀMASTAVARĀJAMU.

This is the same work as that described under R. No. 879.

Complete.

(బి-బి.)—

సమగ్రము వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 879 దున వర్ణింపబడినదే.

R No. 893.

Palm-leaf. Size, 18½ × 1⅜ inches. Foll. 19. Lines, 5 on a page. Mode of writing, fair but not free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1928

(a) పాటలు.

PĀṬALU.

Foll 1-*a*—3-*b*.

Contains benedictory songs addressed to God Viṣṇu.

**Beginning :**

శ్రీ మహాలక్ష్మికిని శ్రితభక్త పాలికిని
శ్రీ మహావిష్ణునకు శ్రీ ధవునకూ
భూమి సంజాతకును భువన ప్రకాశ శ్రీ
రాములకు లక్ష్మీనారాయణులకూ,
జయమంగళం నిత్య శుభమంగళం.
జయతుజయమంగళం, కృష్ణ
శ్రీ శుభమంగళం.

**End**

సర్వావతారునకు సర్వలోకాత్మునకు
సర్వలోకాధ్యక్ష సర్వపతికి

గీర్వాణ వంద్యునకు కేవలాది బ్రహ్మ
సర్వజ్ఞశారదస్వామి కెపుడు.

(వి-వి.)—

వ్రాఁత మంచిదిగాదు. తప్పులు లేవు. శైథిల్యగ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

మంగళ హారతి గేయమిది.

తుదిని క్రింది పద్యములు గలవు.

క. స్తుతివేళను రతివేళను
అతి ప్రేమను రార పోరయన్నను నిగ్గల్
మతిఁదలఁపవలదు ప్రియముగ
చతురాననముఖ్య రుద్రశార్ఙ్గులకైనన్.

క. రావేరావే యన్నను
భావింపఁగ నెగ్గుగాదు భామల ప్రేమన్।
ఏవేళఁ దల్లియైనను
శ్రీ వాణికి గిరిజకైన శ్రీ సిరికయినన్.

(b) అక్షరమాలిక.

AKSARAMĀLIKA (Not nrinted.)

Foll. 4-*a*—10-a

Verses in the Kanda metre written in praise of Vışnu. The author is Palutla Śeşappa.

Complete

**Beginning :**

క. శ్రీ శివపంచాక్షరి . .
కాశితమై యతిరాది కడలను గూడన్
భాసుర మాలిక గాఁగను
జేసెద గోపాలకృష్ణ శ్రితజనపాలా!

క. అదులు కాదులు టాదులు
తాదులు యాదులును గూడఁ దగనేఁబది గా
వేదమయ చేతుఁ బద్యో
త్పాదన గోపాల కృష్ణ ప్రణవాకారా

క. ఓకృష్ణ విష్ణు కేశవ
ఓ కంజదళాయతాక్ష ఓయఘశిక్షా

ప్రాకటనానుతి కావ్యము
హైకొను గోపాల కృష్ణ కమలాధీశా !

క. నారాయణ నీమంత్రము
పారము ముట్టఁగ జపింపఁ బద్మోదరబృం
దారక శివముని ముఖ్యులు
నేరరు గోపాల కృష్ణ నిర్గుణ సుమః

**End :**

క. ఇతి అక్షరమాలికయను
క్షితిలోఁ బద్యావళిగాఁగఁ జేసితి కడిమిగా
ధృతమతినారదు వరమున
చతురత గోపాల కృష్ణ శ్రీ లక్ష్మీశా !

**(c) అష్టాక్షర మాలిక.**

**AṢṬĀKṢARA MĀLIKA.** **(Not printed.)**

**Foll. 10 a-10 b.**

**In praise of God Viṣṇu.**

**Beginning :**

క. ఓంకార మాదిగాఁగను
నంకిలు నారాయణాష్టాక్షరమంత్రం
బొంకిలి జపమున మోక్షము
పొంకము గోపాలకృష్ణ ! పుణ్యాధీనా !

**End :**

క. ఇది యష్టాక్షరమంత్రము
మదినెవ్వఁడు జపముసేయు మాపుగ రేపుగ
మొదలు తుద సుఖముఁ బొందును
వదలక గోపాలకృష్ణ వరవైకుంఠా !

**(d) కేశవ నామాలు.**

**KEŚAVA NĀMĀLU.** **(Not printed.)**

**Foll. 10 b-15 a.**

**Similar to Item No. c just above on this page.**

**Beginning :**

క. వరుసఁ జతుర్వింశతి నీ
వరనామము పావనం బవశ్యము మనుచుఁ
మెఱయు శ్రుతిస్మృతిలతికల
గిరిధర గోపాలకృష్ణ కేశవరూపా

**End :**

క. ఇది యెవరువినిన వ్రాసిన
మదినిష్ఠను బఠనసేయు మాపును రేపుఁ
ముదమును భాగ్యములొసగవె
సదమల గోపాల కృష్ణ సర్వాత్మ హరీ !

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

" ఖరోధనామ సంవత్సర వైశాఖ శు 4 గురువారము వఱకు బెలిజ పుల్లయ్యగారికి పాలుట్ల పేరప్ప చెప్పిన అక్షరమాలిక సంపూర్ణము."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములుగలవు.

శివ పంచాక్షర మాలిక అకారాది క్షకారాంతాక్షరమాలిక నారాయణాష్టాక్షరమాలిక, కేశవాది చతుర్వింశతి నామ మాలిక, యనువిధమున రచితములయిన కందపద్యములు విష్ణు స్తుత్యాత్మకము లిందుఁ గలవు. కర్త పాలుట్ల పేరప్ప.

(౬) వీరభద్ర ఖడ్గాలు.

VĪRABHADRAKHAḌGĀLU. (Not printed.)

Foll 16—18 a. On foll. 18 a and 19 some stray verses are found.

Verses in the Sīsa metre written in praise of God Vīrabhadra. The au or is unknown.

Complete.

**Beginning :**

సీ. శ్రీ పార్వతీధవు సితజటాభరమున
ప్రళయార్కరుచికోటి భాతిఁదనరి
అభ్రంలిహోద భ్రమవిభ్రమ శుభ్రాభ్ర

. . . . . . . . . .

. . . . . . . . . .

శుండాలకరదండ చండదండ
కాలాగ్నిపటుజాల శూలాగ్ర మాభీల
జాలికఁదిక్తటుల్ చంచలింప

* * * *

సీ. అహాహా హో వీర అహాహా హో శరభ
అహాహా నీ సత్వమద్భుతంబు
ఊహింప భువన మత్యాహాహా నీ మూర్తి
పూర్తి సంపూర్తి విస్ఫూర్తిఁ దనరి

ఘనసహస్రాంశుకరముల సహస్రాంశు కరములు
దివ్యాయుధంబులు దీప్తిదనరి
దిక్తటి శర్వరీ దీప్తి వెడలి వెలుఁగ
ప్రళయమారుతగమన భాతిఖ్యాతి
దక్షుమఖు వాటి కాకూట తతిదహించి
తత్క్షణంబున సురలను దఱిమి తౌర
అమిత బలరౌద్రి మాఱట ఆది రుద్ర
వినుత జనభద్ర ఉప్పల వీరభద్ర !

**End:**

సీ॥ గీ. కాచు వేళల శాంతంబు ఖలులదునుమ
నుగ్రమూర్తులు మీరన నొప్పుఁగాదె
ప్రౌఢబు రౌద్ర వీరకృపాసముద్ర
వినుత జనభద్ర ఉప్పల వీరభద్ర.

(వి-వి.)—

సమగ్రము. 12 సీసపద్యములు గలవు. వ్రాఁత మంచిదిగాదు. తప్పుల మయము. శైథిల్య గ్రంథపాతములు గలవు.

వీరభద్రస్వామి స్తుతి రూప సీసపద్యములివి. రచన తప్పుల మయము. కర్తపేరింపు గానరాదు.

---

R. No. 894.

**Palm-leaf. Size, 15¾ × 1¼ inches. Foll. 156. Lines, 6 on a page. Mode of writing, very good but not free from mistakes. Slightly injured. Printed.**

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

శృంగారనైషధము.

ŚṚṄGĀRANAIṢADHAMU.

Same work as that described under R. No. 69. The author of this work was Śrīnātha.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 69 రున వర్ణితమైనదే. కర్త శ్రీనాథుఁడు.

### R. No. 895.

Palm-leaf. Size, 14 × 1¼ inches. Foll. 98. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Very much injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

మహాభారతము (ద్విపద) (విరాటపర్వము).

.AHĀBHĀRATAMU (VIRĀṬAPARVAMU).

Same work as that described under D No. 974 The name of the author is Timmanakavi, son of Vallabhasūri.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము.—ఆద్యంతములు లేవు. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 974 లోన వర్ణితము. కర్త తిమ్మన కవి.

---

### R. No 896

Palm-leaf. Size, 17 × 1¼ inches Foll. 101. Lines, 7 on a page. Mode of writing, fair. Contains mistakes. Injured. Printed

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

మహాభారతము (ద్విపద) (విరాటపర్వము).

MAHĀBHĀRATAMU (VIRĀṬAPARVAMU).

Same work as the above

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు. పూర్వమువలె.

---

### R. No. 897.

Palm-leaf. Size, 16 × 1¼ inches. Foll. 16. Lines, 5 on a page. Mode of writing, not good and not free from mistakes. Much injured and the leaves are in disorder. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

(a) పార్వతీవల్లభ శతకము.

PĀRVATĪVALLABHA ŚATAKAMU.

**Foll. 1 a—10 a ; 10 b is left blank.**

Written in praise of Śiva by Kūcimañci Timmakavi in the Śaka year 1651.

Incomplete.

**Beginning :**

శా. శ్రీ కైలాస మహామహీధర మహాశృంగాటకాంచన్మణి
ప్రాకారాంతర చంద్రకాంత రజతప్రాసాద శుద్ధాంత సిం
హాశారోన్నత హేమపీఠమున గౌర్వియుండవు నిన్నెన్నెదన్
రాకాచంద్ర నిభప్రభాకలిత భర్గా పార్వతీవల్లభా !

* * * *

మ. వరకౌండిన్య సగోత్రపాత్రుని యశోవర్ధిష్ణునిం గుక్కుటే
శ్వరకారుణ్య కటాక్షలబ్ధ కవితా సామ్రాజ్య ధౌరేయునిన్
స్థిరపుణ్యుండగు గంగమంత్రి . . . న్ తిమ్మప్రధానేంద్రునిన్
గరుణన్ బ్రోవుము కూచిమంచికులు భర్గా పార్వతీవల్లభా !

* * * *

మ. అరిషడ్వర్గముద్రోలి సర్వ...లైయష్టాంగ యోగక్రియా
పరుడై గాడ్పుజయించి ముద్రవెలయన్ బ్రహ్మంబు వీక్షించి వా
విరి సోహమ్మని యెంచుచుండెడు మహావేదాంతులౌ యోగిశే
ఖరులెల్లన్ మముఁగాంచుచుండ్రుగద భర్గా పార్వతీవల్లభా !

* * * *

మ. ..............................వాణీసురోద్వాహ స
త్కృతి నిక్షేపములంచు నెంచనలువౌ నీ సప్తసంతానముల్
హితవారంగ నొనర్చి పుణ్యమెనయన్ హేలాగతిన్ మర్త్యుఁడౌ
కరితతిన్ మిమ్ముఁ దలంచనేని మది భర్గా పార్వతీవల్లభా !

మ. అమరం ద్వత్పదపంకజాతయుగ తద్ధ్యాన క్రియాక్రాంత సం
భ్రమలీలన్ విలసిల్లు డెందమొరులన్ బ్రార్థింపఁగా నేర్చునే
సుమనో నిర్ఝరిణీ సువర్ణకమల స్తోమాసవాలంపట
భ్రమరంబేగునె తుమ్మకొమ్మలకు భర్గా పార్వతీవల్లభా !

**End :**

మ. ధరలోనెన్నఁగ శాలివాహన శకాబ్దంబుల్ దగన్ యామినీ
కరబాణాంగ శశాంకసంఖ్యఁ జెలువై కన్పట్టు సౌమ్యాహ్వయ
స్ఫురదబ్దంబున నిమ్మహాశతకమే పూర్ణంబుగావించి శ్రీ
కరలీలన్ బుధులెన్నఁ నీకిడితి భర్గా పార్వతీవల్లభా !

**Colophon :**

ఇది శ్రీమదుభయకవిమిత్ర............బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునందు సకలవేదాంత సిద్ధాంత సారసంగ్రహంబు నుపనిషత్తుల్యంబును విద్వజ్జనానందకరంబును పంచమామ్నాయ... .... .......... సకలసంశయ పరిచ్ఛేదనామ నిర్దేశంబునగు నిది శ్రీ లక్ష్మీనారాయణ కరుణాకటాక్షవీక్షణానందకర సకల... . ...ధనంజయసగోత్రపవిత్ర దాట్ల కృష్ణమరాజసుపుత్ర విద్వజ్జనసేవిత వెంకటరామరాజ నిర్మితంబైన మహాయోగసారంబు సర్వంబును ప్రథమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

భారతమునుండి సంగ్రహింపఁబడిన వేదాంతవిషయక పద్యములిందు గలవు సంధాత వేంకటరామ రాజు. ఈతని తండ్రి దాట్ల కృష్ణమ రాజు. ధనంజయసగోత్రుఁడు.

---

## R. No. 968.

**Palm-leaf. Size, 15 × 1¼ inches. Foll. 235. Lines, 5 on a page. Mode of writing, good and free from mistakes. Very much injured. Printed.**

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28

మహాభారతము (తిక్కన).

**MAHĀBHĀRATAMU (DRŌṆA PARVAMU) BY TIKKANA.**

**Same work as that described under D. No. 174**

**Incomplete.**

(వి-వి.)—

అసమగ్రము. ద్రోణపర్వముమాత్ర మిందుఁగలదు. వ్రాఁత బాగున్నది. తప్పులులేవు. శైథిల్య మధికముగానున్నది. గ్రంథపాతము లేదు.

ఇది డి. నెం 174 లోన వర్ణితమైనదే.

R No. 969.

**Palm-leaf. Size, 15½ × 1½ inches. Foll. 252. Lines, 7 on a page. Mode of writing, good and free from mistakes. Injured. Printed.**

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

(a) మహాభారతము (తిక్కన).

MAHĀBHĀRATAMU (TIKKANA).

Fol 1 (*a*)—221 (*a*). Fol 221 (*b*) is left blank.

Same work as that described under R. Nos. 173, 176 and 185 ante.

Incomplete.

(వి వి.)—

అసమగ్రము. వ్రాంతబాగున్నది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

కర్ణభీష్మమౌసలపర్వములు సమగ్రములుగా నున్నవి.

ఇది డి. నెం 173, 176, 185 రులయందు వర్ణితమైనదే ॥

(b) భాగవతము (పోతన).

BHĀGAVATAMU (NAVAMASKĀNDHAMU) BY PŌTANA. (Printed.)

Foll 222—252.

Incomplete

**Same work as that described under D. No. 87**

(వి-వి.)—

అసమగ్రము. నవమస్కంధము మాత్రము గలదు. వ్రాంత మంచిది. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 87 రున వర్ణితమైనదే.

---

R No 970.

**Palm-leaf. Size, 17½ × 1½ inches. Foll. 201. Lines, 7 or 8 on a page. Mode of writing, good but not free from mistakes. Injured. Printed.**

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

(a) మహాభారతము (తిక్కన).

MAHĀBHĀRATAMU BY TIKKANA.

Fol 1—114

Same work as that described under R. No. 173 (*a*).

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. ఉద్యోగపర్వము మాత్రము గలదు. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 173 (a) రున వర్ణితమయినదే.

(b) జగన్నాథమాహాత్మ్యము.

JAGANNĀTHAMĀHĀTMYAMU (Not printed.)

Foll. 115—201-B

Describes the religious importance of Jagannātha, a place of pilgrimage in the Orissa province It is a Telugu rendering of the Sanskrit work by Vaṅgala Sītārāmācārya. For details see extracts below.

Complete.

**Beginning :**

ఉ॥ శ్రీకరపుష్కరార్ద్రన విజృంభిత పాదసరోజుఁడై నిజా
నాకులలీలచే నఘటనాఘటనత్వ సమర్థతన్ సద
ప్రాకృత నిత్యముక్తులకుఁ బల్కుచుఁ దాఁ బ్రకటింపుచున్ గృపా
లోకసురక్షితార్థ్మ సఃలుండగు శ్రీహరి నాశ్రయించెదన్.

* * * *

శా. కందాళాన్వయ వార్ధిచంద్రుఁ బదవాక్యచ్ఛేదనిష్ఠంద్రు స
ద్వందారుస్ఫుట ముక్తిదాయి విలసత్కాంచీ . .
(ప్న?)ందజ్ఞానవరేణ్యు భాష్యవచన ప్రాహిణ్యు వాధూలగో
త్రాందూభప్రకరీంద్రు వేంకటగురుం బ్రార్థింతు మోక్షార్థినై.

* * * *

క. ఆత్రేయముఖర్షిత్రయ
గోత్రంబున స్వోపలబ్ధ్య కుంఠితజల రు
గ్మాత్రధ్యానజితాంత
శ్శాత్రవుఁడై లక్ష్మణుండు సంభవమొందెన్.

క. ఆపూరుషవర్యుఁడు వం
గీపురిఁ దానాశ్రయించి కృత్రిమసుఖ సం
తాపములయెడ విరక్తుం
డైపగమ .....న బోధనార్థమునకొగెన్.

గీ. యామున గురూత్తమాచార్యుఁడైన రామ
మిశ్రపాదాంబుజద్వయ మాశ్రయించి

* * * *

క. ఆలక్ష్మణార్యవంశజుఁ
డైలోకులు భాష్యకారుఁ డనఁగ సమస్త
శ్రీలఁ గని భాష్యకారుం
డేలెను మును ద్రవిడదేశమెల్ల నిపుణతన్.

గీ. భావ్యకారాత్మజుండయి పదియు నాల్గు
విద్యలనవద్యవృత్తి భావించి చదివి
ధరణిజనులెల్ల శేషావతారమని ను
తింపరామానుజార్యుండు పెంపుచెంద




క. లాంగూల గజపతీంద్రు స
భంగడుఁ బ్రతివాదియుక్తి భంగించి హితుల్
పొంగ విశిష్టాద్వైతమ
భంగురగతి నిర్వహించె... .. .....

(ఈతఁడా రాజుచే కుతారపురము అగ్రహారముగాఁ బడసెను.)




రాఘవాచార్యుఁడు—

గీ. తిలకమల్లి రామార్యుఁ డుత్కలికఁగూఁతుఁ
దెచ్చి తనకు సమర్పింప సచ్చరిత్రుఁ
డతఁడు వెంకటలక్ష్మీసమాఖ్యఁదనరు
సుగుణ నకన్యఁ బెండ్లియై జగతి వెలసె.

వ. రామానుజాచార్యుండును, నరసింహాచార్యుండును, వీరరాఘవాచార్యుండును, చినవీరరాఘవాచార్యుండును, ననుసుతచతుష్టయంబు బడసె. (అందు రామానుజాచార్యుఁడు)

గీ. సర్వశాస్త్రరహస్యార్థ చతురచిత్తుఁ
డుభయవేదాంతభావజ్ఞుఁ డురుపదార్థ
బంధురాంధ్రప్రబంధ తాత్పర్యబోధ
కత్వచణుఁ డాఘనుఁడు శేషుకలదలంప?

క. పురుషవరుఁడతఁడు మద్రే
శ్వరకన్యాపరిణయంబు సత్పద్యమనో
హారరచనా గుంభనమున
విరచించెను రసికులెల్ల విని భళియనఁగన్.
(వీరరాఘవాచార్యుఁడు)

క. ఆవీరరాఘవార్యుని
భావించి ముడుంబివంశభవుఁ డతిహిత వి
ద్యావిదుఁడు రంగశాయి మ
హావినయముతోడ దుహిత నర్పించుటయున్.

వ. వెంకటలక్ష్మి యనియెడి యకన్నియను బెండ్లియై వీరరాఘవాచార్యుండు.

చ. స్థిరయశుఁ డాత్మవేది కలిదిండికులాంబుధి పూర్ణచంద్రుఁడౌ
తిరుపతిరాజు రాజొగవిథించి ప్రధానతఁబూని కేతకీ
పురి నివసించి మేరొఁ దగభూతలమన్య నృపాలులెవ్వ రి
వ్వరు సను స్వామికార్యమున వర్తిలరంచు నుతించ ధీరుఁడై.

చ. తిరుపతిరాజనామ నృపతిప్రవరుండు స్వభూమిభారమా
దరమతి నమ్మహాత్మపయిఁ దప్పక నిల్పి సమస్తభూ దిగం
తరవితతాచ్ఛకీర్తి సతతంబు భజింపుచు నుల్లసిల్లె శ్రీ
హరిపదపంకజాత. . . ......... .. ......

(ఆ వీరరాఘవునకు)

చిన వీరరాఘవాచార్య | తిరుమలాచార్య | సీతారామ | రామనరసింహ

చ. అమ్మహనీయమూర్తికి హితానుజభావముఁజెంది సంస్కృతాం
ధ్రమ్ముల లక్షణంబులు యథావిధి విద్వదనుగ్రహాతిరే

కమ్మున నభ్యసించి సుభగత్వ కవిత్వ పటుత్వ సాధు ర
త్నమ్ముల శిక్షగాంచి కవితావిలసద్రచనాచణుండనై.

క. నూటిజను లెల్లనను సీ
తారామాచార్యయనుచు దయచేఁ బిలువన్
బేరిటఁగల కలిమికి వి
స్తారప్రియమంది నియతిఁ దగువాఁడఁగదన్.

చ. మదవగజుండు సంస్కృత సమగ్రపదార్థ సమర్థుఁ డాంధ్ర వా
గ్విదితమహాప్రబంధ పదపీ పరిశోధకుఁ డాత్మబోధనా
స్పదమతిపండితుం డఖిలభాగవతోచితసేవ నాభిశీ
లదళిత జన్మబంధుఁ డతిలౌకిక కార్య విచక్షణుండిలన్.

* * * *

చ. ఇరుకపియేళ్లవాఁడనయి యెల్లబుధుల్వినుతింపలక్షణా
పరిణయ నామధేయమున భాసిలు కృష్ణకుమారసాంబ స
చ్చరితము పూర్ణవర్ణన రసప్రచురంబుగ సంఘటించి శ్రీ
హరిఁ గృతినాథుఁ జేసితిఁ దదంఘ్రి సమర్పిత చిత్తవృత్తినై.

క. తదనంతరంబ ధర్మాం
గదచరితము చక్రికృతికి .. ...
మృదులపదాశ్వాసత్రయ
ముదగన్ నిర్మించి ప్రాప్తపుణ్యుఁడనగుచున్.

మ. అలఘుస్కాందపురాణ ధన్యతమనీలాద్రీశమాహాత్మ్యమా
ర్యుల యాజ్ఞాప్తిఁ దెలుంగుసేయుటకులో నూహించియిట్లొక్కనా
డెలమిన్ శ్రీవరవైష్ణవార్చనము వేనేకాత్మ వాక్పృత్త వృ
త్తులఁగావించితదుజ్జ్వల ద్రచనకుద్యోగించి ధన్యస్థితిన్.

**End :**

క. యాత్రాద్వాదశకంబు వి
చిత్రోత్సవమొనర నెవఁడు సేవించునతం
డత్రాముత్ర శుభాదిమ
పాత్రంబై దివ్యమహిమఁ బరగు నిజముగాన్

* * * *

క. జగదఖిలసదాప్యాయన
ముగ నిరుపమభోగములఁ బ్రభుత్వము వెలయన్
నగవరముగు నీలాచల
నగమున హరివెలసె నిట్లు నతవరదుండై.

గీ. ఈజ్జగన్నాథ మాహాత్మ్య మెవ్వరేని
వ్రాయఁ జదువఁగ వినఁగ ....చెప్ప
నెద్దిగోరిన నది భజియించి తుదిని
ముక్తినొందుదు రురుభవ ముక్తులగుచు.

క. స్కాందపురాణ సముద్రము
నందు సమస్తార్థదాయిదై యెసగుమహా
మందారమనఁగదగుఁ దడ
వందారు మయాంగ మాధవమహత్త్వ మిలన్

గీ. నేర్పుగొలఁది నిట్లనేకశబ్దములను
మణుల నేర్చికూర్చి మహితపద్య
హారములొగి నీకు నర్పింపఁబడె వీనిఁ
గరుణ నవధరింపు కమలనాభ!

* * * *

మాలిని

సకలభువన వాసస్థానచిత్రోదరా సం
ప్రకటితనిజమాయా బద్ధధాత్రీనిబద్ధా
శుకముఖకృతభవ్య స్తోత్రసంభావితార్ద్రా
గ్వకసితనిజభక్త క్షేమ శ్రీరంగధామా!

**Colophon :**

ఇది శ్రీ జగన్నాథ కరుణారస పరివర్ధమాన కవితా లతాసంప ద్విచి త్రాపస్తంబసూత్రాత్రేయసగోత్ర వంగల వీరరాఘవాచార్య పుత్ర ప్రపన్నజనవిధేయ సీతారామ నామధేయ ప్రణీతంబైన శ్రీ జగన్నాథ మాహాత్మ్యంబునందు సర్వంబును అష్టమాశ్వాసము.

చ. వరమతి మందపాటి కులవారిధిచంద్రుఁడు రామభద్రరా
ట్కరమనురక్తి నీలగిరికాంతుమహత్త్వము వ్రాయ మన్న వ్రా
సె రహిని దత్సుతుండు దివసేశ్వరనామధరుండు క్రోధి వ
త్సరమునఁ బుష్యపౌర్ణమిని సౌమ్యసువాసరమందు సర్వమున్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

ఓఢ్రదేశమందుగల జగన్నాథక్షేత్రపు మాహాత్మ్య మిందు వర్ణితము. సంస్కృత గ్రంథమున కిది తెలుఁగు. వంగల సీతారామాచార్యుఁడు దీనికిఁ గర్త. గ్రంథకర్తృ వంశవృత్తాంతాదిక ముదాహృత గ్రంథ భాగములను బట్టి గుర్తించునది.

## R No. 971.

Palm-leaf. Size, 17 × 1¾ inches. Foll. 103. Lines, 6 on a page. Mode of writing, good but not free from mistakes. Condition, good. Printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

మహాభారతము.

MAHĀBHĀRATAMU By NANNAYA AND TIKKANA.

Same work as that described under D No. 165 ante.

Incomplete

(వి-టి)—

అసమగ్రము. వ్రాత బాగున్నది. తప్పులంతగా లేవు. వైశేష్య గ్రంథపాతములు లేవు.

సభాపర్వములోని ప్రథమ ద్వితీయాశ్వాసములును, ఉద్యోగ పర్వములోని ప్రథమాశ్వాసమును, విరాటపర్వములోని ప్రథమా శ్వాసమును గలవు.

ఇది డి. నెం 165 రున వర్ణితమైనదే.

---

## R No. 972.

Palm-leaf. Size, 17 × 1¼ inches. Foll. 105. Lines, 6 on a page. Mode of writing, not bad but full of mistakes. Condition, good. Printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

నలచరిత్ర.

NALACARITRA

Same work as that described under R. No. 145 ante. The author's name is not known.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత యొకమాదిరిగా నున్నది. తప్పులున్నవి. వైశేష్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 145 రున వర్ణితమైనదే.

## R No. 973.

Palm-leaf. Size, 15¼ × 1¼ inches. Foll. 53. Lines, 5 on a page. Mode of writing, good but not free from mistakes. Very much injured. Not printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

### గుండయ్య చరిత్ర.

### GUṆḌAYYA CARITRA

Describes the story of Guṇḍayya, a great devotee of Śiva. The author is Sanyāsi Kavi, son of Kāśana.

Complete.

శా. శ్రీమత్పర్వతనాయక ప్రియసుతా సీమంతినీరత్నహృ
త్ప్రేమానందకరుండు పద్మజ సునాసీరాద్యనేకామర
స్తోమప్రస్ఫుట ఫాలభాగయుత కస్తూర్యంకితాంఘ్ర్యబ్జుఁ డిం
తే మోదంబున మమ్ము బ్రోవుత దయార్ద్రీభూతచేతస్కుఁడై॥

*   *   *   *

క. అమలాపురాన్వయంబున-నమి(తాత్మజ)జప్రవిశ్రుతాంచిత తేజః
కమలాప్తుఁడు మల్లేశ్వర-విమలాఖ్యుఁడు బుట్టె వంశవిస్తారకుఁడై॥

సీ. అమవామహునకు నంకమ ..... ..
మానవతీలలామకును శైవ
పంచాక్షరీమంత్ర పారాయణుండు నా
రాయణాభిఖ్యుఁ డారయ జనించె
నా(త)···నకునులక్ష్మీ ఘనవేణికి
నుదయించిరి నవాభ్యుదయులగుచు
మల్లన కాశన మహితనామంబుల
నందగ్రజుండు మల్లనార్యుఁ డతని
పత్నియు స·····ద్రికాంబిక ప్రచురస
రణి······ణియన నుర్విఁ జెలఁగి
నాయకునితోడ ననుగమనంబొనర్చి
చారుసాశీల్యసౌఖ్యంబు చూరఁగొనియె॥

సీ. ·········లక్ష్మమ్మ గాత్రీతిలకంబు · ··············· ······ ··
·······························································
·······························································

... దాక్షిణ్యలక్షణ లక్షితాంగుఁడనగ జగతీతలంబున నలరుచుండె।
నతులపంచేంద్రియ... .. .. . ... .. ............. ..
... ...... విగతదోషి సతసూనృతభాషి కాశనమనీషి॥

గీ. ఆవిబుధాగ్రణి రాణి కల్యాణి బహుళ
సద్గుణశ్రేణి కేవల సత్యవాణి।
... .. . విజ్ఞాని కౌతుకార్చిత భవాని
ఘనతరకృపావలంబ శ్రీ గంగమాంబ॥

క. ఆదంపతులందునఁ బర
మోదారులు సతతపూజితోర్వీ———తనూ·
జాదరులు మువురు సుతుల్
సాదరమతియుతలు ఆత్మజలు నల్వురొగిన్॥

క. జనియించి రందు జ్యేష్ఠుం
డన(ఘగు)ణశ్రేష్ఠు......... ..నిష్ఠుఁ।
డనవరత నయగరిష్ఠుం
డనఘుఁడిలో నెన్న చిన్నయాఖ్యుం డలరున్॥

ఉ. సోమయనామధేయుడు వసుంధరపై నలరారె సంతతో
ద్దాముడు నిత్యధర్మగుణధాముఁడు యాచక దృక్సరోజ రు
గ్ధాముఁడు చారుకీర్తి హిమధాముఁడు తామరసేక్షణావళీ
కాముఁడు లబ్ధసర్వ పృథుకాముఁడు భావిగ సోముఁ డున్నతిన్.

క. శితికంఠపదాబ్జ మధు
వ్రతుడన్నుకవీంద్రహితుఁడ ప్రథిత వివేకా।
ర్జిత కన్నమాకళత్రా
న్వితుఁడన్ సన్యాసినామ విఖ్యాతుండన్॥

* * * *

క. శ్రీమత్పంచముఖేశున
కామోదిత సకలతాప సాధీశునకున్।
వ్యోమాంచిత కేశునకున్
హైమవతీ భామినీ నిజాత్మేశునకున్॥

* * * *

**Colophon :**

గద్య॥ ఇది శ్రీమత్పంచముఖేశ్వర చరణారవింద నిష్యంద మరంద బిందుసందోహపానానంద సుందరేందిందిరాకార శ్రీశైల దమంగాపురాన్వయ పయఃపయోధి రాకానిశాకర కాశనార్య ప్రియకుమార సకల విద్వత్కవిజనవిధేయ సన్న్యాసి నామధేయ ప్రణీతంబైన గుండయ్య చరిత్రంబను శైవకథయందు ప్రథమాశ్వాసము॥

* * * *

**End :**

క. అనుచు న్వివిధమున స్తవ
మొనరించిన హరుఁడు మెచ్చి యోహో యనుచున్।
నినుబోలుదురే విశ్వం
బున ............ ........పుణ్యచరిత్రా॥

శా. తత్కాలంబున గుండయాహ్వయ ఘనుల్ (న్) తారేశకోటీర దు
ద్యత్కారుణ్యమెలర్పఁగాఁ బ్రమథలోకాధీశునింజేసి భూ।
భృత్కన్యాతిలకంబుగూడి జగముల్ ప్రీతాత్ముఁడై బ్రోచుచున్
సత్కౌతూహలవృత్తితోడుత నజస్రంబున్ వెలింగెన్ ధరన్॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములుఁ గలవు.

తిరుపురమున కుమ్మరి గుండయ్య యను శివ భక్తుఁడు నీలాంగియను పత్నితోడ జంగమారాధనచేయుచు శివుని ప్రతిదినము తప్పక దర్శించుచుండెను. అతడొకనాఁడర్ధరాత్రమున శివుని దర్శించి వచ్చుచుండ మేడమీద నొక వేశ్య యెంగిలి కంచమును గడుగుచుండెను. ఆ జలము గుండయ్యపైఁ బడెను. అది గమనించి వేశ్య యాయపచారమును మన్నించుటకై యింటికిఁ బిలుచుకొనివెళ్లి స్నాన భోజన స్రక్చందన తాంబూలాదులచే గౌరవించెను. ప్రొద్దుననే గుండయ్య తన యింటికివెళ్లెను. నీలాంగి యాతని చిహ్నములను గమనించి సంశయించి యాతనిమాటల నమ్మక యిల్లు వదలిపోయి కొన్నిదినములకుఁ బశ్చాత్తాపపడి యింటికి మరలరాఁగా నామెను దాఁకుటకుగూడ నొప్పక కేవల శుశ్రూషకుమాత్ర మొప్పుకొనెను. ఈవిషయముదెలిసి యీశ్వరుఁడు జంగమవేషధారియై వచ్చి వారిద్దరకు సమాగమముసేయించి కడపట తన ప్రమథగణాధీశుఁనిగా జేసికొను కథ యిందు వర్ణితము.

కల్యాణిపురమున గురుమూర్తి యనువాడు శిష్యుల కీకథ చెప్పి నట్లు వర్ణింపఁబడినది. ఇది యీశ్వరుని కంకితము. కర్త అమలాపురపు సన్యాసి కవి. తండ్రి కాశన.

---

R. No. 974.

**Palm-leaf.** Size, 16¾ × 1½ inches. Foll. 31. Lines, 7 or 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Much injured. Not printed

Presented by the Majaraja of Pithāpuram in the year 1927–28.

జ్యోతిషవిషయము.

JYŌTIṢAVIṢAYAMU.

This ms. appears to be a portion of a Nāḍi work (in jyōtiṣa). A few horoscopes are illustrated herein.

Incomplete.

129-2-12-222, 932, అనఘ ధనుర్లగ్నంబునకు గ్రహసంఖ్యయు గలిగిన భాగమున ధనుర్గురునవాంశమున లగ్నేశుఁడైన సురపురోహితుడు భాగ్యమున సౌరిసహితుండునై దశమకేంద్రమున కేతువు రిష్ఫమున గవి బుధ కవులు శనినికి కేంద్రమున మృగాంకుడు ఫణీశ్వరసహితుండునై యున్నట్టిసమయంబున నొకరు తుర్యజాతి పీఠాధిపునిచే ప్రశ్న మడుగ బడును. నతడు ద్విజార్థిజన సభామధ్యమున నివాసంబుగాంచి.

**End :**

శత్రుజయకరుండునై అసాధ్యపీఠంబునకు సాధ్యుండునై అవనియం దున నవతరించిన దినాదిరైయె చతుష్షష్టికళాసంపూర్ణుడని . .........నకు నాథుండనై మఱియు షడ్డిశాధిపుడునై షడ్దర్శనాథిపుల అభివాద్యమంది సకలధర్మస్వరూపిరైయె శాస్త్రకళానిధిరైయె సప్తవత్సరంబులు .......... గ్రహసంఖ్యయు గలిగిన వత్సరంబున నొకరు ద్విజోత్తముని గృహంబున నవతరించిన నతివ రక్తశ్యామాంగిరైయె స్వరూపరేఖావిలాసిరైయె.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము చాలఁగలదు. గ్రంథపాతములు చాలఁ గలవు.

ఇదేదో నాడీజ్యోతిషగ్రంథపు భాగము. కొన్నిజాతకములు లేఖ్యో కలవు.

## R. No. 975.

**Palm-leaf. Size, 18½ × 1¾ inches. Foll. 21. Lines, 7 on a page. Mode of writing, good but not free from mistakes. Slightly injured. Not Printed.**

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

సీతావిజయము (పెనుమల్లి బాపయామాత్యుడు).

SĪTĀVIJAYAMU.

Same work as that described under R. No 468 (*a*) ante. The name of the author is Penumalli Bāpayāmātya.

Complete.

(వి వి.)—

సమగ్రము. వ్రాంత సన్ననిది. తప్పులు గలవు. కొద్దిగా శైథిల్యముగలదు. మధ్య కొన్ని పత్రములు లేవు.

ఇది ఆర్. నెం 468 (a) రున వర్ణితమైనదే.

గ్రంథాంతమున నిట్లున్నది.

" పరాభవ సంవత్సర ఆశ్వీజ బ॥ ౧౧ గు॥ వరుకు వడ్డాది పెద వెంకట్రాయుడుగారికి వడ్డాది గోపన్న సీతా విజయము సంపూర్ణంగా ప్రతిచున్నక్రమానను వ్రాసియిచ్చెను."

---

## R. No. 976.

**Palm-leaf. Size, 16½ × 1¾ inches. Foll. 34. Lines, 6 on a page. Mode of writing, good and free from mistakes. Injured. Not Printed.**

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

(a) సర్వలక్షణశిరోమణి (వేంకటకవి).

SARVALAKṢAṆAŚIRŌMAṆI.

Fol. 1 (*a*)—30 (*b*).

Same work as that described under R No. 286 (*b*) ante. The author's name is Veṅkaṭapati.

Incomplete

(వి వి.)—

అసమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు లేవు. శిథిలమైనది గ్రంథపాత మధికముగా లేదు.

గ్రంథాంతమున నిట్లున్నది.

"రౌద్రినామ సం॥ శ్రావణ శు॥ ౮ ఆదివారంవరకు దంతుర్తి సుబ్బయ్య సర్వన్న వేంకటేశాంధ్రం చూచి సంపూర్ణంగా వేంకటేశాంధ్రం శ్రీరామార్పణముగా వ్రాసికొనెను. నండూరి అయ్యప రాజుగారిదగ్గఱ కూర్చుని॥"

ఇది ఆర్. నెం 286 (b) రున వర్ణితమైనదే.

(b) ఆంధ్రభాషారత్నాకరము (లక్ష్మణకవి).

ANDHRABHĀṢĀRATNĀKARAMU. (NOT PRINTED.)

Fol 31 (*a*)—34

Same work as that described under R. No. 399 (b). The name of the author is Lakṣmana Kavi.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులధికముగా లేవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 399 (b) రున వర్ణితమైనదే.

---

R. No. 977.

Palm-leaf. Size, 13 × 1 inch. Foll. 134. Lines, 4 on a page. Mode of writing, not good and not free from mistakes. Injured. Printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

కన్యక చరిత్ర.

KANYAKA CARITRA

This work is similar to the one described under D No 1843.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 1843 రున వర్ణితమైన గ్రంథమునుబోలినది.

## R. No 978.

Palm-leaf. Size 13¾ × 1¾ inches. Foll 48. Lines, 5 on a page. Mode of writing, not good and full of mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

(a) ఎరుకల కురవంజి.

### ERUKALA KURAVAÑJI.

Fol. 1—32-*a* 32 (*b*) is left blank

Similar to the work described under D No 1852

**Beginning :**

వచ్చె నెరుకతహా ॥ యెరుకవారము యెరుకవారమయా సామిసామీ। శృంగారమైనట్టి సొంపుదీపింప। సంగతిగా పాద సజ్జధరింప। పైవల్వ కుచ్చెళ్లు పరగినటింప। కరమొప్ప నడుమున ఘంట లొడ్డాణ ము। సలలితంబుగ బిగిసంతనఁజేసి। ఉంగరంబులు వేళ్ల రంగుమీఱగను పసిడిగాజులు మంచి మిసిమిచలింప। కంకణంబులు ఘల్లుఘల్లనమ్రోయ। కులుకు గుబ్బలపైని గుత్తపు ఆవిక.

**End :**

కుంకుమపంక సంకలితమైన గబ్బిగుబ్బాలా గుమ్మాగదే। నెల వంకాల గోరుక్రొన్నెలజీర గుబ్బాల గోరులుంచనియ్యావే ఓసింగీ। ఎవ్వ డవు నాగుబ్బలు దలచా నీవేగీతివాడవు రా। నీరవ్వాబంగారాయ నేజెల్ల గుబ్బలు రవికపీడె గదరా ఓసింగా—

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 1852 రున వర్ణితమయినదానిని బోలినది.

(b) శారద రామాయణము.

### ŚĀRADA RĀMĀYAṆAMU. (PRINTED.)

Fol 33—48.

The story of the Rāmāyaṇa is described in this work. The author is unknown.

Incomplete.

......అతని యజ్ఞము గావదలంచి, ఒకకోలను తాటకనుద్రుంచి, మఘువాటికి వెసఁ జనుదెంచి, మారీచ సుబాహుల ద్రుంచి,

మదిలోపల సంతోషించి.

॥ అపుశారదా కరుణానిధీ ! ॥

**End :**

ఎంచిరాము దధిక కోపంబుమదినుంచి। అంగదునిఁ జెంగటకు బిలిపించి
రావణుని పాలికీవు చనుదెంచి। నాదుపలుకుగా యీటను వినుపించి
మూఁడుగా యుద్ధమున కునరుదెంచి। రమ్ము వేగంబ శౌర్యమువహించి
అట్లుగాకున్న నేరముసహించి। కావుమని సీత కానుకొప్పించి లంక
విడిచి యెట్లైన·· ···

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

‘అపుశారదా కరుణానిధీ’ అను మకుటముతో చరణాంతాను ప్రాసముగల గేయ రచన మిది. రామాయణకథ యిందు వర్ణితము. కర్తపేరెఱుఁగరాదు.

---

R. No. 979.

Palm-leaf. Size, 15¼ × 1¼ inches. Foll. 48. Lines, 7 on a page. Mode of writing, not good and not free from mistakes. Slightly injured. Printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

(a) ధర్మాంగద చరిత్ర (నరసింహకవి).

DHARMĀṄGADACARITRA.

Fol. 1—32.

Same work as that described under R. No. 454 (b). The name of the author is Bommagaṇṭi Narasimha Kavi.

Complete.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము చాలఁగలదు. గ్రంథపాతములు చాలఁగలవు.

ఇది ఆర్. నెం 454 (b) లోన వర్ణితము.

(b) అంగద రాయబారము.

AÑGADA RĀYABĀRAMU. (PRINTED )

Foll. 33—39. (*a*) 39 (*b*) is left blank.

Incomplete.

(వి-వి.)——

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులుగలవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది రంగనాథరామాయణములోని అంగదు రాయభారపు కథ పట్టు.

(c) భారత సావిత్రి.

BHĀRATASĀVITRI. (PRINTED.)

Foll. 40—44 (*a*).

Same work as that described under D. No 1440. The author's name is not known.

Complete.

(వి-వి.)——

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులుగలవు. శైథిల్యము, గ్రంథపాతములు చాలఁ గలవు.

ఇది డి. నెం 1440 రున వర్ణితము. గ్రంథాంతమందీవ్రాంత గలదు.

'పరాభవనామ సంవత్సర మార్గశిర బ॥ ౧౦ శుక్రవారం పైడి అప్పుసెట్టికి భారతసావిత్రి వ్రాయనాయెను.'

(d) గొడుగుల వచనము.

GOḌUGULAVACANAMU. (NOT PRINTED.)

Foll. 44 (*b*)—48 (*b*).

Same work as that described under R. No. 447 (*c*) ante. The author is not known.

Complete.

(వి-వి.)——

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 447 (c) రున వర్ణితము.

R. No. 980.

Palm-leaf. Size, 11¼ × 1¼ inches. Foll. 16. Lines, 7 on a page. Mode of writing bad. Full of mistakes. Condition good. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

గోపికా గీతలు.

GŌPIKĀGĪTALU.

Fol. 15 (*b*) is left blank.

Describes the prayer of the Gōpikas to Śrī Kṛṣṇa The author is not known.

Complete

**Beginning :**

శ్రీపతియవతారు మూర్తిని చిత్తమ్మున నిలిపి
గోపికగీతలను భక్తితో కొనియాడుచు మతినా॥
హరుండగు నీలాద్రి రమణుని భావమ్మున నిలిపి
గురుతుగ నుతియింతూ చెప్పెద గోపిక గీతలును।
పొంకముతో శుకుడు ఉత్తరపుత్రుల (న) కిట్లనియె
కొంకక వినుడిపుడు చెప్పెద గోపిక గీతలును।
పరమాత్ముండైనాకృష్ణుండు వర్షాఋతువందు
సరసపు గగనమున పున్నమచంద్రుని గనుగొనియె॥

* * * *

**End :**

పరమవు గోపిక లాగీతలు హరిరాచక్రీడావి (ని)
రవుగలిసి చదువు జనులకు నిహాపరములు గ(ల)వు॥
మేలగు గోఫిక లాకృష్ణుని లీలలు కృతిగూర్చి
నీలాచలపతికి ముత్యపుమాలిక గావించె॥

* * * *

నీలాచల రమణా సద్గుణనిర్మల శుభచరణా
పాలయమాం॥ పాలయమాం హరి శ్రీకృష్ణా॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగుగా లేదు. తప్పులతడక. శైథిల్య గ్రంథ పాతములు లేవు. ఇది యొక గేయగ్రంథము. కర్తపేరు తెలియుట లేదు.

గోపికలు శ్రీకృష్ణుని లీలలను వర్ణించు కథ యిందు వర్ణితము.

R. No. 981.

Palm-leaf. Size, 16 × 1⅜ inches. Foll. 25. Lines, 5 on a page. Mode of writing, not good and not free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

(a) ముక్తికాంతాప్రియ శతకము.

MUKTIKĀNTĀPRIYA ŚATAKAMU

Foll. 1—21 (b).

A Śataka, probably in two hundred verses bearing on the Vēdānta The author appears to be a disciple of Dhēnuvukonḍa Timmaguru.

Incomplete Contains 194 verses

**Beginning :**

అఖండే నివసన్ యో మాం......... ....... న్వరైః
తస్యమల్లన నామ్నశ్చ పాదౌ శిరసి ధారయె

శా. శ్రీ కారుణ్య మహానుభావ విజయశ్రీ.... . .
శ్రీకళ్యాణ నిజాశ్రితాళిమతద శ్రీవేదవేదాంత వి
ద్యాకౌతూహల భోగ మోక్ష సుఖదీర్ఘాయుల్ దయన్ నిమ్మటుల్
మాకున్ ముమ్మడిరాజు......... . మల్లాముక్తికాంతాప్రియా !

శా. శ్రీశ్రీఁజేయును గావుతన్ సకలసుశ్రేయోధికంబైన ని
త్యశ్రీలక్ష్మి మదీయ హృత్కమల సీతారామ పట్టాభిషే
కశ్రీ...... . .. ...... .. కులన కారుణ్యదిష్టార్థమి
ట్లా శ్రీముమ్మడిరాజు.......... మల్లా ముక్తికాంతాప్రియా।

శా. శ్రీమద్ధేనువుకొండ తిమ్మగురునిన్ శ్రీరామపట్టాభిషే
కామోదంబున భోగ..... ...... .... దాసగ్రహా
శ్రీమూర్తిన్ సురమౌని నాత్మగమదిన్ సేవించి యోగీశ్వరుల్
స్వామే ముమ్మడిరాజు...

**End :**

శా. వైరాగ్యంబు వివేక పాకసుఖ నిర్వైషమ్యసామ్రాజ్యమున్
..... .. ................ విధ్వస్త ప్రభాభాసుర
శ్రీ..............చిద్రసఘన శ్రీలక్ష్మిసంసారముల్
సారెన్ ముమ్మడిరాజు—మల్లాముక్తికాంతాప్రియా 194

(వి-వి.)——

అసమగ్రము. 194 పద్యములున్నవి. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

‘ముక్తికాంతాప్రియా’ యను మకుటము గల వేదాంతశతకమిది. రెండువందల పద్యములుగల గ్రంథమయియుండును. ‘ముమ్మడిరాజా మల్ల’ గురు ప్రశంసారూపకమగు వేదాంతశతకమిది. గ్రంథకర్త ధేనువుకొండ తిమ్మగురుశిష్యుఁడు గాఁబోలును.

(b) వీరనారాయణ శతకము.

VĪRANĀRĀYAṆAŚATAKAMU. (PRINTED.)

Foll. 22—25.

Incomplete.

Same work as that described under D. No. 1697.

(వి-వి.)—

అసమగ్రము. 14 పద్యము లున్నవి. వ్రాఁత మంచిది. తప్పులు చాలఁ గలవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 1697 రున వర్ణితము.

———

R. No 982.

Palm-leaf. Size, 18¼ × 1⅝ inches. Foll. 24. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Very much injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

గయోపాఖ్యానము.

GAYŌPĀKHYĀNAMU

Describes the puranic story of Gaya written by a son of Timmamantri The work is dedicated to God Nṛsimha worshipped at Ahōbila.

Incomplete.

**Beginning :**

. . .సరస సుదంతవారతుల్ చెల్వంగ
కాళిందికాళాంజి ఘనతఁబూన
శుభలక్షణంబుల సొబగొందు లక్షణ
కుంచ
చంద్ర। సౌధసోపానములుడిగ్గి చంద్రకాంత
రత్నశోభితకక్ష్యాంతరములు గడచి
కొలువుఁగూటంబునకువచ్చెఁ గుధరధరుఁడు.

**Colophon :**

ఇది శ్రీమ దహోబలేశ్వర కరుణాకటాక్షవీక్షణ ప్రవర్ధమాన వైభవ తిమ్మమంత్రి తనూభవ సరససాహిత్య . . . . . (ప్రథ)మాశ్వాసము సంపూర్ణము.

**End :**

సీ. రమణిపాదంబులు రాజత్ప్రవాళముల్
 కరికరంబుల నేలు తరుణి తొడలు
వరనీలముల పేరు వనజా.........
.. ....... ........ వెలదుక కెమ్మోవి
 రాకేందుబింబంబు రమణి మోము
కాము మార్గణములు కమలాక్షి నేత్రంబు
 ..............................
..............................
గంధసింధురమదలించు కలికి నడలు
చంద్రికాస్ఫూర్తి నిరసించు చాననగవు
తెలివతన కాంతి గెలుచును దీగ మెఱుపు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులకుప్ప. శైథిల్యము చాలఁ గలదు. ఆకులు తునాతునకలయి చెడినవి. గ్రంథపాతములకు లెక్కలేదు.

గయోపాఖ్యానకథా ప్రతిపాదకమయిన ప్రబంధమిది. తిమ్మమంత్రి తనూభవుఁడగు కవి యెవరో అహోబల నృసింహస్వామి కంకితముగా రచియించినది.

---

## R No 983.

**Palm-leaf. Size, 10¾ × 1½ inches. Foll. 3. Lines, 6 on a page. Mode of writing, not good and not free from mistakes. Not printed.**

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

విడిపద్యములు.

VIḌIPADYAMULU.

Contains stray verses taken from some unknown works on the Vēdānta.

**Beginning :**

మ. అలనాఁడార్తిని బిల్వ నాకభయమయ్యె కాళవాణిధ్వనిన్
 బలుకావాకఁము సతఁపో జయమొ నాభాగ్యంబు దా నెటిదో

తెలియన్నేరక విస్మరించితిని యేతీరైనను బ్రోవ ని
ర్మల నీవేగతి కావవే దయను రామా యార్తరక్షామణి!

**End :**

సీ. ఎవ్వండనే జగంబెట్టిది సంసార
మెవ్వరి కకటా యెందు గలిగె
ఎట్టునున్నాడనో యేరూపువాఁడనో
యేచందమో మందమేది త్రాత
ఒకనాటికిని నేను నున్నదున్నట్టుగా
కన్నవారలలోనఁ గలసిమెలసి
తలయెత్తగలవాఁడ దైవకటాక్షంబు
నేరీతినున్నదో యెవఁడు గలఁడో
యనుచు దేహాదిక భ్రమలన్ని విడిచి
వేదవేదాంతవేత్తల విధమెఱింగి
యేడుగడయును గురుఁడంచు నెంచువాఁడు
స్వస్వరూపోపదేశార్హ జనుఁడు భూప.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు చాలఁగలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

రామా ఆర్తరక్షామణీ, కృష్ణా ఆపదుద్ధారకా, అను మకుటములుగల పద్యములు కొన్ని, ఏదో వేదాంత గ్రంథములోని పద్యములు కొన్ని యిందులో గలవు.

---

R No 984.

**Palm-leaf.** Size, 15¼ × 1½ inches. Foll. 33. Lines, 10 on a page. Mode of writing, good and free from mistakes. Slightly injured. Printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927-28.

(a) ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానము.

ĀNDHRAŚABDACINTĀMAṆI VYĀKHYĀNAMU.

Foll. 1 (*a*)—30 (*a*) 30 (*b*) is left blank.

Same work as that described under R No. 142 ante. The author of the commentary is Elakūci Bālasarasvati

Complete

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చాల అందము గానున్నది. తప్పులు లేవు. కొద్దిగా శైథిల్యముగలదు. గ్రంథపాతము లేదు.

ఇది ఆర్. నెం 142 రున వర్ణితమైనదే.

(b) ఆంధ్రభాషారత్నాకరము (లక్ష్మణకవి).

ĀNDHRABHĀṢĀRATNĀKARAMU. (NOT PRINTED.)

Foll (*a*) 31—33 (*b*)

Same work as that described under R. No. 399 (*b*) ante.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత సొంపుగానున్నది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

గ్రంథాంతమున నిట్లున్నది.

"కాళయుక్తి సం॥ చైత్ర శు ౧౩ స్థిరవారంసరికి దీక్షితుల వెంకన్న ఆంధ్రవ్యాకరణమునకు టీక బాలసరస్వతీయమున్ను ఆంధ్రభాషారత్నాకరమున్ను స్వంతానికి వ్రాసికొనెను."

ఇది ఆర్. నెం 399 (b) రున వర్ణితమైనదే.

---

## R No 985.

**Palm-leaf. Size, 13 × 1¼ inches. Foll. 15. Lines, 3 on a page. Mode of writing, not bad but not free from mistakes. Condition good. Not printed.**

**Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.**

మహావాక్యవివరణము.

MAHĀVĀKYAVIVARAṆAMU.

This is an explanation, according to the Advaitic view, of the Upaniṣadic sentence 'Tattvamasi' The author is not known.

Incomplete

**Beginning :**

మహావాక్యములనగా తత్పదమని, త్వంపదమని, అసిపదమని ముఖ్యపదములు.... ..వాచ్యార్థమని లక్ష్యార్థమని రెండు గలవు. వాటి

వివరం తత్పదానకు వాచ్యార్థం ఈశ్వరస్వరూపం, త్వంపదానకు వాచ్యార్థం జీవస్వరూపం. అసిపదానకు వాచ్యార్థం ఈరెంటికి ఐక్యం.

*           *           *

**End :**

నాకు ఒకటి నివరార్థ తోస్తున్నది. జీవేశ్వరులని, ప్రత్యగాత్మ పరమాత్మలని జ్ఞాననిమిత్తం శాస్త్రింపలుకుట గాని స్వరూపజ్ఞానమే బ్రహ్మనిష్ఠ. అది సిద్ధించినట్లయితే దేహమే లేకయుండును గనుక ఆ యభిజ్ఞానం ఎట్లాగల్గునో యిక నాకు స్వస్వరూపజ్ఞాననిష్ఠ అనుభవమయ్యే రీతిగా అనుగ్రహించవలెనని ప్రార్థించిన విని శ్రీ గురుస్వామి శిష్యుఁడు శ్రవణంచేతనే మననరీతి నిశ్చయించఁగలవాడని నిశ్చయించి యానతిస్తున్నారు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొకమాదిరిగానున్నది. తప్పులుగలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు. "తత్త్వమసి" యను మహావాక్యమునకు అర్థము వివరముగాఁ జెప్పఁబడినది. కర్తపేరు తెలియుట లేదు.

---

R. No 986.

Palm-leaf. Size, 16 × 1¼ inches. Foll. 65. Lines, 5 on a page. Mode of writing, good but not free from mistakes. Injured. Printed.

Presented by the Maharaja of Pithāpuram in the year 1927–28.

(a) చంద్రరేఖావిలాపము (జగ్గకవి).

CANDRAREKHĀVILĀPAMU (BY JAGGAKAVI).

Foll. 1 (*a*)—51 (*a*).

Same work as that described under D. No. 490 of the Descriptive Catalogue, Vol 2. The author's name is Jaggakavi.

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 490 రున వర్ణితమైనదే.

(b) చిన్ని వేంకటనరసీయము.

CINNI VEṄKAṬANARASĪYAMU.

Foll 52-*a*—65-*b*. Not printed.

A satire written by Rēkapalli Mahādēvakavi ridiculing Pilla Veṅkaṭa-narasimha.

Incomplete.

**Beginning :**

క. వినుతింతు సోమలింగని । ఘను వేములవాడ భీమ కవిని దలంతున్
గొనియాడుదు శ్రీనాథుని । ననవరతము జగ్గరాజు నభినందింతున్.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, సుకవిజనతాభినందనంబును గావించి యేనొక్క చమత్కారానుసార పరిహాసకథానుబంధబంధురం బగు ప్రబంధంబు రచియింపంబూనియున్న సమయంబున.

సీ. తనదుర్యశంబను ఘనతమాలలతల
కలదిశల్ ప్రాకులెత్త సర్వ
తన దుర్గుణవినీల మణినికరమునకు
బ్రహ్మాండభాండంబు బరిణగాఁగ
తనజారతానిమిత్తములకు ద్రవిడవై
దికపుంబ్రథాని సాధకుఁడుగాఁగ
తనదుకౌటిల్యవర్తనలకుఁ బూరాడ
పాత్రుండు నుపదేశ భట్టుగాఁగ
వసుధఁ జెన్నారెఁ బిల్లాన్వవాయహీన
మానవాగ్రణి సకలదుర్మార్గవేది
విప్రజనధనభక్షణాతిప్రియుండు
దురితములతోడు వేంకట నరసిగాఁడు !

* * * *

క. ననురేకపల్లి సతుర్కల । వననిధిచంద్రుని గిరీశ వరకరుణా సం
జనితకవిత్వవిశాలునిఁ । గనుఁగొని యిట్లనియె నధిక కౌతుకమతియై.

సీ. రచియించితివి పతివ్రతాలమహాత్మ్య వ
ర్ణనగల ధర్మాంగద నృపచరిత
ముచ్చరించితివి విద్వచ్ఛయంబులు మెచ్చ
రాణించు బసవపురాణ మహిమ

కావించితివి చమత్కారానుసార ప్ర
బంధంబులును జాటుపద్యవితతు
లొనరించితివి సమయోచిత వాగ్గుంభ
సంభృతార్థానూన శతకసమితి
రాజరాజాధిపరిషద్విరాజమాన
విబుధమండల వినుత కవిత్వనిధివి
భళిర నీపాటి సత్కవీంద్రులును గలరె
సుగుణసాంద్ర మహాదేవ సుకవిచంద్ర !

* * * *

క. వావిరి నీకృపఁగృతి గా । వేవేగ రచించి చిన్ని వేఁకటనరసి
యావిశ్రుతమశకృతి సం । భావనగా నిచ్చువాఁడ వగవకుమింకన్.

**End :**

సీ. తొలుత వైద్యముసేయఁ దొడరుచోఁ గానుకర్తి
నరసింగరాయని నామమడఁచె
నామీఁదఁ బ్రౌఢవైద్యముచేసి జంపని
వెంకయ్య యసువులు వీడఁజేసె
వదవడి సత్తెప్ప పంతులుగారికి
ప్రాణముల్ గొనెజి మాత్రల నొసఁగ
పిమ్మట వైష్ణవ తిమ్మయ్య చెయిసూచి
యముని సేవారతి కనిచి పుచ్చె

నహహా నీ భేషజంబు ప్రాణాంతమయ్యె
ననుచుఁ జనములు సెప్పెదు రనుదినంబు
గురుధనాహర పిళ్లటంకురుకుమార
ఘోరబహుళాంహ వేంకట నారసింహ !

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు చాలఁ గలవు.

పిళ్ల వెంకటనరసింహాహ్వయునియెడ ద్వేషించి, రేకపల్లి మహాదేవ నామకవి రచించిన హాస్యనిందాగర్భప్రబంధమిది. చంద్రరేఖావిలాపముఁబోలినది.

## R. No. 987.

Palm-leaf. Size, 15⅜ × 1⅜ inches. Foll. 7. Lines, 6 on a page. Mode of writing, fair. Almost free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

శ్రీరామచరిత్రము.

ŚRĪRĀMACARITRAMU.

This is a portion of the first Āśvāsa of Rāmacaritra, by Nandūr Bāpamantri

Incomplete.

**Beginning :**

ఉ. శ్రీనగకన్య నెన్నుదుటఁ జెన్నగుకస్తురి బొట్టుగాంచి నీ
యాననమంబుజంబని ప్రియంబున భృంగము వ్రాలెఁ జూడుమా
మానిని యంచు దర్పణము మాటికిఁ జూపెడు శంకరుండు నా
మానసవీథినిల్పి యసమానశుభంబులు మాకొసంగుతన్.

* * * *

మ. పరమామ్నాయవిశారదున్ మదమహాప్రత్యర్థి దోషజ్ఞ సిం
ధురపంచాననుఁ బంచవక్త్రపదపాదోజాతసేవాధురం
ధరు శాస్త్రవ్రజ పారగున్ పదపదార్థజ్ఞున్ గుణాంభోనిధిన్
గురునిన్ శ్రీయడవల్లి లక్ష్మణసమాఖ్యున్ గొల్తు వాక్సిద్ధికిన్.

మ. అసమానోజ్జ్వలధీయుతున్ గణితవిద్యాతత్త్వవేద్యున్ లస
త్ప్రసవాస్త్రోపమసుందరాంగుని జగత్ప్రఖ్యాత . .
రసికాగ్రేసరు రామరాజకుల పారావారశుభ్రాంశుబ్రా
. . . సగోత్రు వేంకటప్రధాన గ్రామణిన్ గొల్చెదన్.

* * * *

సీ. నన్నయభట్టార్యునకు వందనముచేసి
యెఱ్ఱప్రెగ్గడకవి కెలమిమ్రొక్కి
తిక్కనసోమపీథికి దండమొనరించి
బమ్మెరపోతయ ప్రవరుఁబొగడి
భాస్కరకవికి నమస్కారమొనరించి
శ్రీనాథునకు నమస్కృతులొనర్చి
పింగళిసూరనకుం గేలుమోడిచి
ప్రీతి వేములవాడ భీముఁబొగడి

ఘనుని నేనుఁగు లక్ష్మణకవిభజించి
మాన్యుఁడగు కూచిమంచి తిమ్మకవి నెంచి
తత్సహోదరు జగ్గ సత్కవిని గొలిచి
మఱియు నాంధ్రకవీంద్రుల మదిఁదలంచి.

* * * *

తే. గీ. కంబుసన్నిభమగు వృషభంబునెక్కి
వ్యాఘ్రచర్మోత్తరీయంబు వన్నెమీఱ
గరుణ వెంబూరి సోమలింగంబు స్వప్న
మందు ననుఁజూచి పల్కె నత్యద్భుతముగ.

సీ. నీతాతతండ్రి లోకాతీత విశద వి
ఖ్యాత యశస్కుండు కౌతురాజు
నీతాత భూసుర నివహబంధువ్రాత
పరిపోషకుండు బాపప్రధాని
నీతండ్రి సేతుకాశీతలమధ్య భూ
విభుసభాపూజ్యుండు వెంకమంత్రి
నీతల్లి భువనవర్ణితదానధర్మ ప్ర
పూతగుణాలంబ బుచ్చమాంబ
నీవనేకభవార్జిత నిశ్చలాస్మ
దీయపదభక్తిసంజాత దివ్యభక్తి
వాసనావాసితుఁడవు శ్రీవత్సగోత్ర
పావనుండవు నందూరి బాపమంత్రి.

**End :**

మ. తడవచ్చోటున నిల్చియుండుటకు విత్రస్తాత్మవై యేఁగిరా
పడతుల్ వారిపురంబుఁజేర నపుడున్మ్రాంతాత్ముఁడైవార లె
య్యెడకుంబోయిరొయంచు నవ్వనమునం దే . . . .

(వి-వి.)——

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథ పాతములు చాలఁ గలవు.

ఇది నందూరి బాపమంత్రి రచియించిన శ్రీరామచరిత్రలోని ప్రథమాశ్వాసైకదేశము. విశేషముల కుదాహృతగ్రంథభాగముఁ జూచునది.

## R. No. 988.

Palm-leaf. Size, 14 × 1¼ inches. Foll. 136. Lines, 7 on a page. Mode of writing, fair but not free from mistakes. Much injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927-28.

మహాభారతము (తిక్కన).

MAHĀBHĀRATAMU (By TIKKANA)

Same work as that described under R. No. 375.

Incomplete.

(వి-వి.)—

విరాటపర్వము సమగ్రముగాఁ గలదు. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు చాలఁ గలవు.

ఇది ఆర్. నెం 375 రున వర్ణితమయినదే.

ఆశ్వాసాంతమున నిట్లున్నది —

"జయనామ సం॥ భాద్రపద శు ౨ శుక్రవారంవరకు అత్రేయపురపు జగ్గరాజు విరాటపర్వం చిలూకూరి సుర్వరాయుడి కొమారుడు చెల్లయ్యకు వ్రాసియిచ్చెను."

---

## R. No. 989.

Palm-leaf. Size, 16¾ × 1¾ inches. Foll. 237. Lines, 6 on a page. Mode of writing, fair but not free from mistakes. Much injured. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927-28.

భాగవతము (పోతన).

BHĀGAVATAMU (By PŌTANA).

Same work as that described under R. No. 372

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. దశమస్కంధము పూర్వోత్తరభాగము లున్నవి. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 372 రున వర్ణితమయినదే,

R. No 990.

alm-leaf. Size, 16¼ × 1⅜ inches. Foll. 154. Lines, 4 on a page. Mode of writing, not good and not free from mistakes. Injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

పంచతంత్ర కథ.

PAÑCATANTRA KATHA.

The stories of the Pañcatantra are described herein in colloquial Telugu. In complete.

**Beginning :**

పాటలీవరపురమనే పట్నంకద్దు. అందున సుదర్శనుండనే రాజు కలండు. ఆ రాజుగుణములు ఎటువలెనంటేను.

ప్రభుర్వివేకీ ప్రమదా సుశీలా తురంగమశ్శస్త్రనిపాతధీరః
విద్వాన్ విరాగీ ధనికశ్చ దాతా పంచైవ రత్నాని భవంతి లోకే.

**End :**

శ్లో. ఉత్తమం క్షణకోపం చ మధ్యమం ఘటికాద్వయమ్
అధమం తు అహోరాత్రం పాపిష్ఠం మరణాంతకమ్.

అన్నాడు గనుక ఆబకము దినమున్నూ ముంగిసను స్నేహం చేసుకొని దానికి మత్స్యాలు కానుకలిచ్చి అనుసరించి యాపామును చంపించెను. ఆ ముంగిస ఉంతటనిలువక మానిమీదనెక్కి బకసమూహమంతా నానాటికి నిర్వంశంజేసెను. అదిగనక మనమున్నూ సుబుద్ధితో వాదాడరాదు. అని మఱియు దుర్బుద్ధి తండ్రి యిట్లనియె.

(వి.వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు చాలఁగలవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

పంచతంత్ర కథలు వ్యావహారిక వచనరచనలో గలవు.

---

R. No. 991.

Palm-leaf. Size, 16 × 1¼ inches. Foll. 149. Lines, 9 on a page. Mode of writing, not good and not free from mistakes. Slightly injured. Fot printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28

వచనమహాభారతము.

VACANAMAHĀBHĀRATAMU.

This is a portion of the Mahābhārata in prose. The author is Paiḍipāṭi Ādinārāyaṇakavi.

Incomplete.

**Beginning :**

క. శ్రీదసఖముఖసురార్చిత। పాదసరోజాత దైత్యభంజనవర కా
కోదరమంచశయానా। కాదంబిని సన్నిభాంగ కస్తూరిరంగా.

వ. అక్కథికుండు శౌనకాది మహామునుల కిట్లనియె. అట్లు జనమే జయునకు వైశంపాయనుండు వినుపించినతెఱం గెట్టిదనిన. అట్లు ధర్మ తనయుండు సుఖసామ్రాజ్య ధౌరేయుండైయున్న యతనియొద్ద వాసు దేవసహితుండైయున్న యర్జునునకు మయుండు కృతాంజలియై యిట్లనియె.

**End :**

నజ్ఞాతవాసంబును నిర్వర్తించి లోకనింద్యంబు పరిహరించి పరాక్ర మంబునం బగఱ నిర్జింపందలంచెదము. దాని నిర్వహించు భారంబు నీయది యని నిన్నుశరణంబుసొచ్చియు మాకుశుభోదయంబగుట నిశ్చయంబుగాదె యనిన విని కృష్ణుండు తన సమీపంబున నున్న పాం చాలింజూచి యిట్లనియె. నీరజాక్షీ! నీపుత్త్రులు మదంబున యదుకుమా రులు నతులసుహృద్భావహృదయులై గజరథారోహణపరులై యాయుధ శస్త్రాస్త్రంబులు గఱచుచు వింతవోఁడలంగి ప్రద్యుమ్నువలన దివ్యా స్త్రంబు లభ్యసించుచున్నవారు. సుభద్రయుఁ దన పుత్త్రులకంటె నీ తనయులందు మూర్తిదనరంగం బ్రియంబుసేయుచున్నది. నీవింక నూఱ డిల్లుము మహోన్నత వైభవంబులం బెంపారుటకు సమయంబు సమీ పంబయ్యెనని ద్రౌపది నాశ్వాసించెనని వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుండు తరువాతి వృత్తాంతం బెట్లనిన,—

క. పుష్కరదళనిభనేత్రా। పుష్కరచరనికర సతత పూజిత చరణా
పుష్కరచరావతారా। పుష్కరనామాంతరీప పూరితకీర్తి.

* * * *

**Colophon :**

ఇది సకలసుకవిసముత్కర వ్యాతతశేశయోవతరీకృత భాస్క రాయమాణ పైడిపాటి భాస్కరామాత్య తనూభవ అదినారాయణ ప్రణీతంబైన విద్వజ్జన హృద్యానవద్యగద్యకావ్య మహాభారతంబునందు అరణ్యపర్వంబునఁ బ్రథమోల్లాసము.

(వి.వి.)—

అసమగ్రము. సభాపర్వము సమగ్రముగను, అరణ్యపర్వమున ప్రథమాశ్వాసమును గలవు. వ్రాత మంచిది. తప్పులంతగా లేవు శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది వచనాంధ్రమహాభారతభాగము. కర్త పైడిపాటి ఆదినారాయణకవి. ఈ కృతి శ్రీ రంగనాథస్వామికి సమర్పితము.

---

## R No 992.

Palm-leaf. Size, 13 × 1¼ inches. Foll. 204. Lines, 5 or 6 on a page. Mode of writing, not good and not free from mistakes. Condition good. Printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

(a) ఉత్తరగీతా టీక.

UTTARAGĪTĀ-ṬĪKA (BY PARAMĀNANDA TĪRTHA).

Foll. 1—108(*a*). Foll. 108 (*b*) and 109 are left blank.

Same work as that described under R. No 264(*b*).

Incomplete.

(వి.వి.)—

అసమగ్రము. వ్రాత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 264 b రున వర్ణితమయినదే

(b) శ్రీరామస్తవరాజము.

ŚRĪRĀMASTAVARĀJAMU.

Foll 110—204(*b*) Printed.

Same work as that described under R. No. 5. The name of the author is Mallana.

Complete.

(వి.వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లల్పములు.

ఇది ఆర్. నెం 5 రున వర్ణితమయినదే.

గ్రంథాంతమున నిట్లున్నది :—

"ప్లవంగనామ సంవత్సర చైత్రశుద్ధమందు పుదూరి సంప్రతి రామశాస్త్రిగారికి కుమారుడు చిత్తంబట్టి చాత్తాద రామానుజం శ్రీరామ స్తవరాజం ప్రథమ తృతీయాశ్వాసములు రెండున్ను వ్రాసియిచ్చినది."

---

R. No. 993.

**Paper. Size, 8¼ × 5⅜ inches. Foll. 80. Lines, 21 on a page. Mode of writing, not good and not free from mistakes. Condition injured. Not printed.**

Purchased in the year 1927–28 from M R Ry Pondyala Venkatasubrahmanya Sastri Garu, Pandit, Rajah's High School, Pithapuram.

గంగాగౌరీశవిలాసము.

GAṄGĀGAURĪ_AVILĀSAMU.

Describes the divine deeds of God Śiva. The author is Vīranārādhya, a disciple of Cidambara Guru.

Complete

**Beginning :**

ఉ. శ్రీ మహిమాభిరాముఁడు విశేషగుణామృతసాగరుండు తే
జోమయమూర్తి యవ్యయుఁ డజుండు నజాండకోటియంత దేవతా
స్తోమచకోరకప్రచయసోముఁడనాది చిదంబరుండు నా
స్వామి కృపాకటాక్షరుచిజాలతచే నను బ్రోచుచుండెడిన్.

* * * *

(మల్లికార్జున పండితారాధ్యవంశమున లింగనారాధ్యుఁడు,—అతఁడు గౌతమీతీరమున కాళేశ్వరమున వసించెను. అతనికి వీరనారాధ్యుఁడు, అతనికి లింగారాధ్యుఁడు, లింగారాధ్య భార్య చెల్లాంబిక,—వారికి, వీరనారాధ్యుడు, అమృతలింగము, భోగలింగము, అని ముప్వురు బిడ్డలు—అందు అమృతలింగము కుమారుడు (గ్రంథకర్త).
(కృతిపతి)

సీ. కమనీయలక్ష్మ్యంబికాగర్భశుక్తికాం-తరసముత్పన్న ముక్తాఫలంబు
మల్లారిసూరినామకభవ్యదుగ్ధసా-గరసంప్రకాశిత కౌస్తుభంబు
విజ్ఞాననిలయ సావిత్రీచకోర నే-త్రీహృత్కుముద శర్వరీవిభుండు
చారుసరస్వతీ చక్రస్తనీముఖ-సరసీరుహోన్మేష ఖరకరుండు.
దాసచాతకనవజలదముదివాక-రాదికాసారఖేలన హంసశుద్ధ
సత్త్వగుణవర్తి పరశివ తత్త్వమూర్తి-దయను బొడసూపెఁ గలలోఁ
చిదంబరుండు.

**End :**

మ. నరులాసక్తిగ నెవ్వరేని మహితామ్నాయార్థ సంయుక్తిని
హరలీలాచరితామృతంబు ధరలో నాచంద్రతారార్కమై
వరలన్ విన్నను వ్రాసినన్ జదివినన్ వంశాభివృద్ధిన్ నిరం
తరసౌఖ్యం బతిసంపదం బొరసి యానందింతు రశ్రాంతమున్.

క. భువినీప్రబంధమును సతతవి కర్ణరసాయనముగ గంగా గౌరీ
శవిలాసమున రచింపుచు-శివునకునర్పించితిఁ గృతిఁ జేకొనఁగ మదిన్.

* * * *

**Colophon :**

ఇది శ్రీమన్మౌళికదంబ హృదంబుజస్థ చిదంబరానవరత వరప్రసా దాసాదిత మల్లికార్జున భక్తకొండధీతారాధిప గౌతమసగోత్ర వంశాంశ రంగద మృతలింగారాధ్యపుత్ర సుధీజనమిత్ర వీరారాధ్య వాగనుషంగ మంగళాంగీకార గంగాగౌరీశ విలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులంతగాలేవు. శైథిల్య. గ్రంథపాతములు గలవు. గ్రంథము పీచుకాగితములపై వ్రాయబడినది

ఇయిదాశ్వాసముల యీ ప్రశస్తప్రబంధమున గొన్ని శివలీలలు వర్ణింపబడినవి. కవి వీరనారాధ్యుఁడను చిదంబరగురుని శిష్యుఁడు. కృతి ప్రేరకుఁ డాచిదంబరగురుఁడే. గ్రంథకర్తృవంశాదిక ముదాహృత గ్రంథ భాగముబట్టి గుర్తించనగును.

---

R. No. 994.

**Sritala. Size, 9¾ × 2 inches. Foll. 176. Lines, 16 on a page. Mode of writing, fair but not free from mistakes. Slightly injured. Printed.**

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28.

(a) ముముక్షుజనకల్పకము.

MUMUKṢUJANAKALPAKAMU.

Foll. 1—30. Foll. 31 and 32 are left blank.

Same work as that described under R. No. 217 (c). The author's name is not known.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాత ములు గలవు.

ఇది ఆర్. నెం 217 (*a*) రున వర్ణితమయినదే.

(b) వివేకసింధువు.

VIVĒKASINDHUVU

Foll. 33—102-(*b*) Not printed.

This is a metrical rendering of a Vēdānta work called Vivēkasindhu of Vāsudēva Yōgi written in prose The author is Vēgināṭi Koṇḍānāryuḍu For details see extracts below.

Complete.

**Beginning :**

శా. శ్రీకైవల్యరమాకటాక్షవిలస చ్ఛృంగారభావప్రమీ
లాకర్ణాంఘ్రి సరోజుఁడై తదనుభూత్యానందసంధానసు
శ్రీకాత్మారాముఁడై విదావ్యయసుధా ....రతిం డోకుర వి
ద్యాకలాప్రస్తుతుఁడైనమద్గురుని దత్తాత్రేయులం గొల్చెదన్.

* * * *

క. ఘనసంసారాబ్ధి నిమ
గ్నుని నను వెడలంగ దిగిచి . . చాలబోధకళా ?
వనదర్శుఁ జేసి తత్త్వ
జ్ఞానిఁగా నొనరించి పెంచు శుభగురుఁ దలతున్.

చ. సరసిరుహాసనుంబొగడి శార్ఙ్గకశరాసను సన్నుతించి శం
కరుఁగొనియాడి భారతికి గౌరవమొప్పఁగ మ్రొక్కి భార్గవిన్
నరమరలేక యెంచి తుహినాద్రిజ భక్తిభజించి మత్తసిం
ధురముఖుఁగొల్చి వారికృప మాతనసత్కృతి నే రచించెదన్.

* * * *

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును శ్రీగురు సమారాధనంబును పురాతన సత్కవిజన సన్మానంబును కుకవినిరసనంబును గావించి సకలంచితభవాబ్ధితారణంబులైన వేదాంత ప్రకరణంబులు సదానంద సాధ్యంబై యా ముకుందమునీంద్రుం డాంధ్రభాషరచియించిన వచన కావ్యంబైన వివేకసింధువు నిరవద్య గద్య పద్యాత్మకంబుగాఁ బ్రబంధంబు సేయ సమకట్టి నామనంబున.

**End :**

ఇతి శ్రీమద్వివేకసింధౌ సంహారక్రమే గురుశిష్య సంవాదే ప్రతిబంధత్రయనిరూపణంనామ పంచదశం ప్రకరణం.

* * * *

క. మంగళ శుభచరిత వియ-ద్గంగాతటినీప్రభూత కారణచరణో
త్తుంగమహిమానుషంగా-రంగ ద్విమలాంతరంగ రాగవిభంగా!

**Colophon :**

ఇతి శ్రీగురు దత్తాత్రేయ కృపాలబ్ధకవితావిచిత్ర శ్రీవత్సనగోత్ర పవిత్ర వేగినాటివంశ పారావారనిశాకళత్ర నాగయామాత్య పుత్త్ర సరసగుణధుర్య కొండనార్య ప్రణీతంబైన వివేకసింధువను మహాప్రబంధంబునందు చతుర్విధ మహావాక్య వివరణ ప్రకారంబును తాదాత్మ్య త్రయ నిరూపణంబును అజిహ్మత్వాది షడ్విధ వృత్తివిస్తారంబును ప్రతిబంధత్రయ నిరూపణంబును గల సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యంత మంచిదిగాదు. తప్పు లంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

వాసుదేవయోగి వచనరూపముగా రచించిన వివేకసింధువను వేదాంతప్రకరణ గ్రంథమున కిది పద్యానువాదము. గ్రంథకర్త వేఁగినాటి కొండనార్యుఁడు. విశేషముల కుదాహృతగ్రంథభాగముఁ గాంచునది.

(c) పరతత్త్వరసాయనము.

PARATATTVARASĀYANAMU.

Foll. 103—113. Not printed.
Same work as that described under R. No ...
Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. ఇది ఆర్. నెం 111 రున వర్ణితమయినదే.

(d) చౌడేశ్వరి కథ.

CAUḌĒSVARIKATHA.

Foll. 114—126 (b). Not printed.
Complete.

**Beginning :**

శ్రీరుచిరాకారు శ్రితజనాధారు-ధారాధరశ్యాము దైతేయభీము
భీమ విక్రమధాము పృథుయశఃకాము

* * * *

శ్రీవీరచౌడాంబఁ జిత్తంబులోన-భావించి సేవించి భక్తిఁబూజించి
ఆదటలోకవిఖ్యాతమైయెసగు-ఆదిమకవులఁ దానందఱఁ బొగడి
శ్రీకరంబుగ విరచించనేఁగోరు-నాకథావృత్తాంత మదియెట్టిదనిన,
హరిహరబ్రహ్మాదు లఖిలదిక్పతులు

**End :**

సరవితో చెప్పుదు చౌడాంబ యొసగు
భూచక్రమున నిది పూజ్యమైయొప్పు
ఆచంద్రతారార్క మైయొప్పుగాత.

గ్రంథాంతమం దీవ్రాఁత గలదు :—

"వికృతినామ సం॥ చైత్ర శు 15 సోమవారంనాడు హరిదాసాచార్యులు వ్రాసిన తొగమునికథ."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

చౌడేశ్వరీదేవికథ యిందుగలదు. కర్తపేరెఱుఁగరాదు. ఇది యెల్ల ద్విపదకృతి.

(e) మంత్రసారార్థదీపిక.

MANTRASĀRĀRTHADĪPIKA.

Foll. 127—128. Not printed.

Same work as that described under R. No. 490 (*a*) of the Sanskrit part.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు.

ఇది సంస్కృతమున ఆర్. నెం 490 (*a*) రున వర్ణితము.

(f) ఉత్తరగీతలు.

UTTARAGĪTALU.

Foll 129—132 (b). rinted.

Same work as that described under R. No. 264 (b)

Incomplete.

(ఓ-ఓ).—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

ఆర్. నె 264 (b) చూ వర్ణితము.

(g) దేవాంగపురాణము.

DĒVĀṄGAPURĀṆAMU.

Foll. 133—176 (b) Not printed.

Similar to the works described under R. No. 613 and D No. 949. The author is not known.

Incomplete.

(ఓ-ఓ.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసమమాత్రము గలదు. వ్రాంత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యముగలదు.

ఇది ఆర్. నెం 613 చు, డి. నెం 949 చున వర్ణితమైన రెండు రచనములబోలిన రచనాంతరము. కర్త పేరెందు లేదు. ఇది ద్విపదకృతి.

---

R No. 995.

Palm-leaf. Size, 12 × $1\frac{1}{4}$ inches. Foll. 43. Lines, 6 on a page. Mode of writing, not good and not free from mistakes. Slightly injured. Not printed.

Presented by the Maharaja of Pithapuram in the year 1927–28

మీనాక్షీస్తుతి.

MĪNĀKṢĪSTUTI.

Written in praise of Goddess Mīnākṣī worshipped at Madura.

Complete.

**Beginning :**

శ్రీగణాధిపతీశ శృంగార చారిత్ర-శ్రీపార్వతీతనయ శ్రీవిలాస
శ్రీసుందరప్రియా సిద్ధివినాయక-భక్తపరిపాలన భవవిదూర

శాశ్వత సర్వజ్ఞ సర్వవిద్యానిధీ-గజముఖ చంద్రకోటిప్రకాశ
అగణితగుణధీర అద్వయ సంపూర్ణ-బ్రహ్మచర్యవ్రతా బ్రహ్మవిదుష

**End :**

సత్యస్వరూపిణి సదాసదసత్స్వరూపి
చిద్రూపిణి నిత్యసుఖస్వరూపిణి !
ఆనందరూపిణి సదాశివ సుందరప్రియే
నమోనమస్తే జయమీనలోచని !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. అన్నీ తప్పులే. శైథిల్య గ్రంథపాతములు లేవు.

మధుర మీనాక్షీ దేవిమీఁద స్తుతిరూపముగాఁ జెప్పఁబడిన రోత పద్యములు తప్పులమయమయిన రచనములు.

---

R. No. 996.

Paper $9\frac{1}{2} \times 10\frac{1}{4}$ inches Foll. 174. Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good. Not printed.

Transcribed in 1918–19 from a manuscript of Boḍḍapāṭi Venkaṭēśvara Rao Garu, Ramanapūḍi, Gudivada taluk.

(a) చతుష్షష్టి జ్వరములు.

CATUṢṢAṢṬIJVARAMULU.

Foll. 1—72-(*b*).

On the diagnosis and treatment of fevers, diseases of the heart, etc.

The author's name is not known.

Incomplete.

**Beginning :**

. . . దోషా మనుష్యాణా మాయుర్వృద్ధిశ్చ జాయతే
జాయతే . . . . మందాగ్నావజీర్ణం జీర్ణ సంభవం॥
అజీర్ణమక్రమప్రాప్త జ్వరం శీఘ్ర సముద్భవం।

* * * *

చతుష్షష్టిజ్వరాల పేళ్లు.

చతుష్షష్టిజ్వరాణాంతు నామాని వివిధాని చ
ప్రోక్తాని లోకరక్షార్థం తాని వక్ష్యామ్యహంశ్రుణు
వాతఃపిత్తం కఫశ్చేతి ద్వంద్వజ్వర ఉదాహృతః
* * * *

వింశతి గుల్మనిదానం

వాత గుల్మనిదానం

సదాశూలం చ గర్భాంతం రోదనం శూలముద్భవం।
* * * *

పైత్యగుల్మనిదానం

దారుణం శూలసంతాప ముద్గారం వమనం సదా।
* * * *

శ్లేష్మ గుల్మనిదానం

గర్భాంతం గోళకం చైవ ముద్భవం రోదనం సదా
* * * *

**End :**

నేత్ర రోగాలు

కలకం (నేత్రరోగంచ) రుధిర నేత్రంచ చిబిరం రోమనేత్రకం
జోతిశ్శోణిత నేత్రంచ రక్తదర్దర నేత్రయోః॥
* * * *

(ఐ-వి.)—

అసమగ్రము. వ్రాఁతతిన్నదిచే. తప్పులు చాలఁగలవు. శైథిల్యము లేదు గ్రంథపాతములున్నవి.

జ్వరము, కాసము, శోఫ, హృద్రోగము మున్నగుగల రోగముల నిదానములు తచ్చికిత్సలు నిందు వివరింపఁబడినవి. కర్తపేరిందు గానరాదు.

(b) ఆయుర్వేద సారసంగ్రహము.

ĀYURVĒDASĀRASAṄGRAHAMU.

**Foll. 73(*a*)—106(*b*). Not printed.**

A medical work in prose and verse, on the diagnosis and treatment of certain diseases; gives also some recipes. The author is Kṛṣṇayya, son of Anantanāmātya.

Incomplete.

**Beginning :**

క. మునుమున్న కుక్షిశూలయు
తనువున నెల్లడను గొప్పి తంద్రయుదగ్గుఁ
ఘనమగు ననుతాపంబును
బెనగొనునది సన్నికంద్రము పంకజనాభా॥

క. తలయూఁచుట దాహంబును
గళగవమును పెకుర్వాంతి కడు మోహంబుఁ
బలువగు తాపము వెకిర్యయు
గలదంతయు సన్నికనిరి గౌరీశనుతా॥

**Colophon :**

ఇతి శ్రీ గోవింద వరప్రసాద లబ్ధవాగ్వైభవ అనంతనామాత్య సంభవ సుకవిజన విధేయ కృష్ణయ నామధేయ ప్రణీతంబైన ఆయుర్వేద సారసంగ్రహంబునందు క్షయరోగ నిదానంబును హిక్కానిదానంబును పాండురోగ లక్షణంబును కుంభకామిలానిదానంబును హాలీముఖలక్షణంబును శ్వయథు విజ్ఞానంబును మహారోగంబుల లక్షణంబులును వాత నిదానంబు శీత వాతంబులును చర్మవాత రక్తవాత కఫవాత యేకాంగ వాత పైత్యవాత అశ్మరీ మూత్రకృచ్ఛ్ర అసాధ్యమూత్రకృచ్ఛ్ర కుష్ఠువు విసర్పి వింశతి మేహంగబులును అష్టోదర నిదానంబును యోనిశూల విద్రధి భగందర మూలవ్యాధి ముప్పాండు ? చతుర్విధగ్రహణులున్నది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

* * * *

**End :**

పచ్చికడుగుతోడ పద్మకేసరములు
నల్లకలువగడ్డ తెల్లపంచ
దారతేనెతోడ తాగంగనిచ్చిరా
రక్తపిత్తమణగు రయముతోడ॥

గీ. తివిరి ద్రాక్షపండు ధృతిగడ్డసరపాకు
నీళ్లతోడగాచి నిర్ణయముగ
బంచదారయందు బ్రతిపాకముగబెట్టి
పరగనియ్య రక్త పైత్యమణఁగు॥

(చక్కెరయును అడ్డసర)

. . . . . . . . . . . . . .

(వి-.వి)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. ప్రథమ ద్వితీయాశ్వాసము లున్నవి. తృతీయాశ్వాసమున కొంత భాగము గలదు. వ్రాంత లిన్నిడదే తప్పులున్నవి: శైథిల్యము లేదు. గ్రంథపాతములుగలవు.

ఇది యొక పద్యగద్యాత్మకమగు వైద్యగ్రంథము. ఇందు కొన్ని రోగనిదానములు తచ్చికిత్సలు వివరింపఁబడినవి. కర్త కృష్ణయ్య. అనంతనామాత్యుని కుమారుఁడు

(c) ఔషధయోగములు.

AUṢADHAYŌGAMULU.

Foll. 106-*b*—172(*b*), foll. 173 and 174 are left blank. Not printed.

Gives certain recipes and formulas based on the *Āyurvēda*, and other useful medical information.

Incomplete.

**Beginning :**

వాతోన్మాదపీడనం

అజ్ఞానజ్ఞానశూన్యత్వం సంచారం న చ భాషణం
బలం తేజం కాయవృద్ధి రగ్నిమాంద్యం శిరోవ్యథా।
న చ వస్త్రశుచిత్వం చ న భుక్తం న చ సుప్తకం
మాంద్యం మూత్ర పురీషాణా మశుచిస్సర్వదానరః
వాతోన్మాదం మహాపాపం యతిహత్యాదికారణం॥

* * * *

**End :**

అంతర్దాహాలున్ను జ్వరాలున్ను మేహసంబంధమైన వ్రణాలు శుక్ల మేహాలు దగ్గు మూత్రకృఛ్ర రోగాలున్ను రక్తపైత్యాలున్ను చిత్తవైకల్యమున్ను శమించును.

ఇక్షురగోక్షుర మర్కటబీజబ
బ్రహ్మశతావరి శాల్మలిసహితం
గోఘృతశర్కర మధుభిర్యుక్తం
శతనారీభిః పురుషోరమతే॥

(వి-వి.)—

అసమగ్రము. తప్పులున్నవి. రోగలక్షణములు తచ్చికిత్సలు, కొన్ని యౌషధయోగములు నిందు చెప్పఁబడినవి.

## R. No. 997.

**Paper.** Size, 9½ × 10¾ inches. Foll. 152. Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes There are small omissions in many places Condition, good. Not printed.

Restored from the Mackenzie local records (No. 15-3-64) of this Library, in 1918-19.

కైఫియ్యతులు

KAIFIYATS.

This is a copy of the report written by Mr. Mallayya, clerk of Col Mackenzie on the 23rd June 1811, regarding his tours in and about Santarāvūru and other villages.

Incomplete.

**Beginning :**

సంతరావూరు కైఫీదు

కైఫియ్యతు మం॥ మోటుపల్లి నాయిడుపల్లి సం॥ సంతరావూరి సరాహర్ మత్తుజాన్నగరు॥

పూర్వం తపః ప్రభావసంపన్నులయినట్టి అగస్త్యమహాముని యీ పూర్వ సముద్రమందు ముకుళాకారంగా పట్టణ నిర్మాణం చేయించి ముకుళాపురమనే నామం యేర్పర్చి యీ పట్టణంలో వనవాస కోదండరామం సీతాలక్ష్మణ సమేతంగా ప్రతిష్ఠ చేసి రఘునాథస్వామి వారనే పేరుపెట్టి మరిన్ని యీ నగరానుకు మల్లేశ్వరస్వామి యనే లింగమూర్తిని క్షేత్రపాలకత్వమునకు ప్రతిష్ఠ చేసినారు.

**End :**

యాదాస్తుధారా కోట తాలూకా జోడామురా తా॥ దీగి అనే గ్రామము కరణం పెద్ద కృష్ణమహాంతి వాకీఖత్తు వగైరా స్న ౧౨౨౮ వ ఫసలీ ౧౮౧౮ సం॥ ౧ దీగి గ్రామము.

ఈ గ్రామము సరిహద్దులు . . . . . . . .

* * * *

ఈనాములు ౬, మెట్ట ౭౮౪౦, పల్లం ౮౮౪౦, ౮౩ మజాకూరు. యీనాములు ౧౧, కరణం యీనాములు ౧, మెట్ట ౧౦, పల్లం ౭౯౪౦, గ్రామచాకర్లు ౮, మెట్ట ౬౮౪౦, పల్లం ౮౩౪౦, ౧౫ మెట్ట ౫౭, పల్లం ౧౭౨౪౦ సాక తలిమ్మా జిరాయతి ౩౯౧౪౦, మెట్ట ౬౫౪౦, పల్లం ౩౨౬.

ప్రదాయక, బృందావరవంద్య ? అప్రమేయ, అచల, అమితా . . . . . ముక్తిప్రదాయక, శ్రీ వైకుంఠనాయక, శ్రీ రాఘవేశ్వర, శ్రీకృష్ణకుమా . . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదే. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి. ఇది డి. నెం 1464 దున వర్ణిత గ్రంథమువంటిదే. విష్ణుభక్తుఁడగు కృష్ణమాచార్యుల ప్రభావ మిందు విశేషించి చెప్పఁబడియున్నది.

---

R. No. 1035.

Paper. Size, 9½ × 10½ inches. Foll. 72. Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good. Printed.

Restored in 1933–34 from a MS. D. No. 1388.

(A) ప్రసన్నరాఘవ శతకము.

PRASANNARĀGHAVAŚATAKAMU.

Foll. 1—20 (*a*). Fols. 71 and 72 are left blank.

Complete.

Same work as that described under D. No. 1613.

**Beginning :**

శ్రీహరి జానకీరమణ శ్రీరఘునాయక నీమహాత్వముం
బాహుబలంబు శౌర్యమును భానుకులంబున బుట్టురీతియు.

* * * *

**End :**

ఉ. ఛందము లక్షణం బెఱుఁగఁ జెప్పితినేఁ గవనంబు కొద్దిలో

* * * *

గ్రంథాంతమున నిట్లు గలదు.—

"వనపర్తి కొండా పండితులు వారు వ్రాసిన ప్రసన్నరాఘవ శతక ద్వయం సమాప్తం."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి. ఇది డి. నెం 1613 దున వర్ణితమయిన గ్రంథమువంటిదే.

(B) వెంకటేశాంధ్రము.

VEṄKAṬĒŚĀNDHRAMU.

Foll. 20 (*b*). 27 printed.

Incomplete.

**Beginning :**

శ్రీభామాకర్తోక్తి క
భాభవ నిజమందహాస భాగధగ శ్రీ
శోభిత శుభ తత్వ చకుం
భాభోగకిలాస వేంకటాచలవాసా.

* * * *

**End :**

కరివేల్పుదల బుజమునగల తెగలు
రేలు నేల యేలుదంటలు రేడులనగ
చక్రవతి యనదనరు చక్రవర్తి
పంకజాతాప్త నీకాశ వేంకటేశా.

(వి-వి.)—

అసమగ్రము. తప్పులున్నవి. గ్రంథపాతములు గలవు.
ఇది డి· నెం 1388 రు ప్రతికి పుత్రిక.

(C) బల్లిపలుకు ఫలము.

BALLIPALUKUPHALAMU.

Foll. 28—33 (*a*). Not printed.

Complete.

Same work as that described under D. No. 2360.

**Beginning :**

శ్రీకగ మొప్ప రాజీవ మిత్రుని మీఁద
పలికిన గౌళికి ఫలము వినుము

* * * *

**End :**

సుర గురుదశకంబు శుక్రవారంబెల్ల
శంకరుడానమందు జక్కితోడ

* * * *

శనియావారంబు దిశమిందు చెలగి యుండు
రాహుశుతును గౌళి యీరీతి చెలగియుండు.

(వి-వి.)—

సమగ్రము. తప్పు లున్నవి. క్షేపక్య గ్రంథపాతములు లేవు. ఇది డి. నెం 2360 రున వర్ణితమయినదే.

(D) సంకీర్ణ విషయములు.

SANKĪRṆAVIṢAYAMULU.

Foll. 33 (*b*)—69 (*a*). Not printed.

Incomplete.

**Beginning :**

సీ. ఘడియలోపల తాటి ముత్తినియుగ
దిట్టిన మేధావిభట్టుకంటె
రెండు ఘడియలలోన బ్రహ్మదండియు నెల్ల
దుర్గ దిట్టనకవి మల్లుకంటె

* * * *

**End :**

శ్లో. వైదేహీపరి మండలోపరి లసన్మాణిక్యపీఠాసనం
మధ్యస్థం నవనీతకోమలరుచిం నీలోత్పలశ్యామలం
కందర్పాయుతకోటిసుందరదృశం పూర్ణేందుబింబాననం
కౌసల్యాకులభూషణం రఘువరం శ్రీరామచంద్రం భజే.

(వి-వి.)—

అసమగ్రము. తప్పులున్నవి. గ్రంథపాతములు గలవు. భీమకవిమీఁది పద్యములు, కృష్ణరాయలమీఁది పద్యములు పాటుపుడు పద్యములు మున్నగునవి యిందున్నవి. కొన్ని గేయములును గలవు.

(E) మండూక వృత్తములు.

MAṆḌŪKAVṚTTAMULU.

Foll. 69 (*b*)—70 (*b*). Not printed.

Incomplete.

**Beginning :**

రత్నంపు మెరుగురా రమణిమై సొంపురా
పుష్యరాగంబురా పొందుపరచి.

* * * *

**End :**

. . . . . శ్రీమద్యాదవ వంశాంభోనిధి తారాకాంతా మహీజనపాలక శ్రీరంగేశ్వర పురసామ్రాజ్యా॥

గ్రంథాంతమున దేవకీనందన శతకమందలి పద్యములు రెండున్నవి.

(వి-వి.)—

అసమగ్రము. ఇది ఆర్. నెం 1028 రున వర్ణితమయినదే.

---

## R. No. 1036.

Paper Size, 9½ × 10½ inches. Foll. 36 Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes Condition, good Not printed.

Restored in 1933–34 from a MS. R. No. 858.

పావులూరి గణితము.

PĀVULŪRIGAṆITAMU.

Incomplete.

**Beginning :**

అందు ప్రథమ గుణాహారం పరికర్మ గుణాకారంబు చెప్పిన తద నంతరంబు ద్వితీయ భాగహారంబు చెప్పెద నది యెట్టిదనిన—

* * * *

**End :**

క. . . . . . . యునారులో ము
ప్పాతికెయు రెంటిలోన పాతికెయు ము
ప్పాతికె కన్లైలు నాల్గిట
నేదడినదుచ . . . నె . . కన్లైల్.

* * * *

ఇది శ్రీ శంకరస్వామి పదకమల మధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన దశగణిత ప్రోక్తంబునందు సర్వంబును సమాప్తము.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్. నెం 858 ర ప్రతికిది పుత్రిక.

R. No 1037.

Paper. Size, 9½ × 10½ inches Foll 88 Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good. Not printed.

Restored in 1933–34 from a MS. D. No. 3103.

సిద్ధాంత సంగ్రహము.

SIDDHĀNTASAṄGRAHAMU.

Fol. 88 (*b*) is left blank.

Incomplete.

This is a Telugu version of the Sanskrit works on astronomy such as Sūrya siddhānta, Jyāganita, Grahalāghava, etc., and it explains with illustrations the positions of planets, determination of eclipse, etc. Taḍakamaḷḷa Venkatakṛṣṇa Rao is the author.

**Beginning :**

క. శ్రీ వేంకటేశ సద్గురు
భావించి మనంబులోన భాస్వరవిధులన్
సేవించి సూక్ష్మదృగ్విధి
గావించెద జాతకాది కల్పనములకై.

క. అచ్చులెల్లను పూర్ణంబు (౦) నమర చెల్లు
ఞాకలు జ్ఞానంబునట్టుల నమర చెలువు
కాదులును, టాదులును, పైదుపాదులగును
యాదులెన్నిటి వర్ణసంఖ్యలను చెల్లు.

క. లోకప్రసిద్ధ సంఖ్యలు
వాకొనుటయు నందు నందు వలనగుచలినన్
చేకొననగు తోనా (౪౯) దులు
సాకల్యముగాంగ (౯) నందసంఖ్యలు దిశలన్ ౧౦.

* * . *

**End :**

విగడియలు ౧౬౩ కి గడియలు ౨.౫౩ నత గడియలు ౪.౪౨ తీసి వేయగా శేషం గడియలు ౦.౪౯ కు విగడియలు ౧౦౯ ఇది మీనలగ్నం లంకోదయ విగడియలు ౨౭౮ కంటె . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

సూర్యసిద్ధాంతము, జ్యాగణితము, గ్రహలాఘవము మున్నగు సంస్కృత గ్రంథములకిది యాంధ్రానువాదమగును. గ్రహస్ఫుటము, లగ్నస్ఫుటము, గ్రహమందోచ్చాదులు, గ్రహణ నిర్ణయము మున్నగు విషయములిందు సోదాహరణముగ వివరింపఁబడినవి. ఎడనెడ పద్ధక ములు (Tables) ను గలవు. కర్త తడకమళ్ల వెంకటకృష్ణ రావుగారు.

---

## R. No. 1038.

Paper Size, 9½ × 10½ inches Foll. 104. Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes Not printed

Restored in 1934–35 from a MS. R. No. 854.

రాధాకృష్ణ విలాసము.

RĀDHĀKṚṢṆAVILĀSAMU.

Complete.

**Beginning :**

వరగుణభావ్యకారనిరవద్య మనోజ్ఞ మతాధికారతఁ
గరముల శంఖచక్రములు గైకొని విష్ణువుబోలి శిష్యులం
బరమకృపారసేక్షణను బావనశీలుల జేయుచున్నయా
తిరుమలనారసింహగురు ధీరు దలంచెద నిష్టసిద్ధికిన్.

* * * *

**End :**

గ్రంథాంతమందీవ్రాఁతగలదు—

"పింగళనామ సంవత్సర మార్గశిర శుద్ధ ౧౫ సోమ . . . సరిగె బిరుదు బుచ్చన్న కుమారుఁడగు అచ్చన్న శ్రీ పాకలపాటి అచ్యుత రామరాజుగారికి రాధాకృష్ణవిలాసం పుస్తకం రామార్పణంగా వ్రాసెను."

ఈ పాకలపాటి అచ్యుతరామ రాజు వంశావళియును చివర మూఁడు పుటలలో గలదు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్. నెం 854 ఈ ప్రతికిది పుత్రిక.

## R. No. 1039.

Paper Size, 9½ × 10½ inches Foll. 10 Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes Condition, good. Not printed

Restored in 1934–35 from a MS. D. No. 1716.

శ్రీ వేంకటేశ శతకము.

**ŚRI VĒÑKAṬĒŚAŚATAKAMU.**

Incomplete.

**Beginning :**

సీ. శ్రీమత్త్వదంఘ్రి రాజీవసేవాసక్తి
నిరతంబు నామది నిలుపవయ్య
శ్రవణేంద్రియము మీ సచ్చరిత్రామృత
మ (కరంద మానంగా) మరపవయ్య

* * * *

**End :**

కేళి కాగరు ధూపగంధిలంబు
పృథులషడ్జస్వరోద్గీతభిల్ల
పలవార్థ గీతికా కర్ణనాద
భీతిపగకశాత్మ పటీరకోటరకుటీర
లీనఫణియగు నకోట న గానసయ్యె.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఇది డి. నెం. 1716 కు ప్రతికి పుత్రిక.

---

## R. No. 1040.

Paper Size, 9½ × 10½ inches Foll 18 Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good. Not printed

Restored in 1934–35 from a MS. D. No. 888.

ప్రసన్నవేంకటేశ్వరవిలాసము.

**PRASANNAVĒÑKAṬĒŚVARAVILĀSAMU.**

Fol. 18 is left blank.

Incomplete.

**Beginning :**

ఉ. శ్రీ యువతీమనోహరు నశేష జగత్పరిపోషణక్రియో
పాయధురీణు కల్మష విభంజను నారదకుంభజాత్రిగా

* * * *

**End :**

ద్విపద. అని విశ్వవిశ్వంభరారాధ్యుఁడు పేర

* * * *

ధరబుకరాయసముద్రముం గెలచు

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతము లున్నవి.

ఇది ఆర్. నెం 838 రు ప్రతికి పుత్రిక.

---

R. No. 1041.

Paper. Size, 9½ × 10½ inches Foll. 14. Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good Not printed.

Restored in 1934–35 from a MS. R. No. 853.

శ్రీరామముక్తావళీ శతకము.

ŚRIRĀMAMUKTĀVAḶĪŚATAKAMU.

Fol. 1 (*a*)—12.

**Beginning :**

శ్రీమద్భూమిసుతాకుచస్థలక కాశ్మీరద్రవామ్రేడితా

* * * *

**End :-**

శ్రీమద్భవ్యపరాశరాన్వయసుధా సింధూజ్జ్వలత్పూర్ణిమా
సోముండౌ నతగానమాధవకవీశుం డెమ్మెని జేసెఁ గా సదా ?
క్షేమం బిచ్చుతత్త్వదర్పణంబు గదురఁ శ్రీరామముక్తావళీ
నామగ్రంథము దీని నిల్పు కృపతోడఁ రామదైవాగ్రణీ ?

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఆర్. నెం 853 (ఎ) రు ప్రతికిది పుత్రిక.

(B) రామనవరత్నములు.

RĀMANAVARATNAMULU.

Fol. 12—14; Fol. 14 (*b*) is left blank.

**Beginning :**

శ్రీవైకుంఠపురాగ్రణీనిభశుభశ్రీణాఖిలైశ్వర్యల
క్ష్మీవల్యూజ్వల దివ్యరత్నభవన శ్రీస్వర్గది కాటార్యయా

* * * *

**End :**

ఇది శ్రీమన్మథమంత్రివంశ బలరామేష్టప్రణీతాత్మద ?
ధృతయత్భాణ్ణవరత్నమాలిక త్వదీయైశాశతప్రక్రియా
ప్పదమా దీనిఁ బఠించు వ్రాయువిను జీవశ్రేణికిన్నిత్యసం
ముదమొందింపుమ ప్రేమధామ నిధిధామా రామా దైవాగ్రణీ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. వైశిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్ నెం 853 (b) రు ప్రతికిది పుత్రిక.

---

R. No. 1042.

Paper. Size, 9½ × 10½ inches. Foll. 76 Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good. Not printed.

Restored in 1934–35 from a MS. R. No. 807.

తారకబ్రహ్మ రామాయణము.

TĀRAKABRAHMARĀMĀYAṆAMU.

Incomplete.

**Beginning :**

సీ. . . . . . . . .
గాలి నెచ్చెలి పాదుకలు ధరింప
సమవర్తి చెంగట సందడుల్వారింప
నసురవల్లభుఁడు జోహారు చెల్ప

* * * *

**End :**

" వ్రాలా శత్రులు తప్పులు
చాలంగలవేను శబ్దసంగతుతెరుఁగ

గేలిం బెట్టక దిట్టక
హేళగా దిద్దరయ్య బుధజనులారా ।"

(వి-వి.)

అసమగ్రము. వ్రాంత తిన్నని దే. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్. నెం 807 రు ప్రతికిది పుత్రిక.

---

## R. No. 1043.

Paper. Size, 9½ × 10½ inches. Foll. 126 Lines, 20 on a page Mode of writing, not good and not free from mistakes Condition, good Not printed.

Restored in 1933–34 from a MS. D. No. 1449.

మధురమంగా పుంశ్చలీ లీలావిలాసము.

### MADHURAMAṄGĀPUMŚCALĪ LĪLĀVILĀSAMU.

Incomplete.

**Beginning :**

మొద్దుమోకడయిన నిజస్వామిని మంగమ్మ తదీయస్వామియైన రాయలదేవుని చరతలనే సంతత కాలక్షేపంబు చేయుంబడుచున్నదను.

* * * * *

**End :**

ఇదిగో ప్రసాదంబందుక యుండటికి విందుబెట్టమనిన నాయనుభవులు వరసగా నందరివారలు యాచ్యావచ్ఛంబుగా పుచ్చుకొని కడకు ప్రసాదజకారంబు లాయననమాశంబులును నటువలె నుచ్ఛిష్టాశనంబు లనందుక . . . అయ్యలారా అక్షరాలా యించాకామీరు

. . ,

(వి-వి.)—

అసమగ్రము, వ్రాతయంత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

డి. నెం 1449 రు ప్రతికిది పుత్రిక.

---

## R. No. 1044.

Paper. Size, 9½ × 10½ inches Foll. 148 in 1st Vol , Foll. 136 in 2nd Vol. Lines, 20 on a page. Mode of writing, not good and not free from mistakes. Condition, good. Not printed.

Restored in 1933–34 from a MS. D. No. 1259.

శబ్దతత్త్వవివేకము.

ŚABDATATVAVIVĒKAMU. VOL. I.

Fol. 1, 283 and 284 are left blank.

Complete.

**Beginning :**

పీఠిక—సంస్కృత భాషను విశేషముగా గౌరవపరచుటచేత వృద్ధికాగల యొంపదగిన సదృశము లేని ఫలములను తెలియనివారు మిక్కిలి స్వల్పమగుటచేత దాన్ని గుఱించి ప్రకృతములో విచారింపవలసిన ఆవశ్యకము లేదు.

* * * *

అ.ఆ.ఇ.ఈ.ఉ.ఊ.ఋ.ౠ.ఌ.ౡ.ఏ.ఐ.ఓ.ఔ. ఈ పదునాలుగున్ను అచ్చులు (జీవాక్షరములు)

* * * *

VOL, II.

**Beginning :**

ఆణ్ పరముగా నుండునపుడు భావకర్త్రర్థకము గాని యత్ప్రత్యయము పరముగా నుండునపుడును ఆత్మనే, అధ్వనే, • వీటికి ఖప్రత్యయము పరముగా నుండునపుడును అన్ ప్రకృతిభావమును పొందును. సామ్నః అయం సామనః . . . . . . .

* * * *

**End :**

॥ఇతి త్రిలింగాధికారః॥ ఇతి లింగానుశాసనం సంపూర్ణం॥ ఇతి బాలబోధిన్యాం శబ్దతత్త్వవివేకాఖ్యే ప్రథమభాగే ప్రథమకోశః సంపూర్ణః॥

(వి-వి.)—

సమగ్రము. రెండు సంపుటములుగాఁగలదు. వ్రాఁతమంచిదే. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది డి. నెం 1259 రు ప్రతికి పుత్రిక.

---

R. No. 1045.

Paper. Size, 9½ × 10½ inches Foll. 24 Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good. Not printed.

Restored in 1934–35 from a MS. D. No. 12406 (Skt.).

చిత్రకవిత్వదర్పణము.

CITRAKAVITVADARPANAMU

Foll. 1, 2, 23 and 24 are left blank.

Complete

This work illustrates the different modes of poetic composition such as Cakrabandha, Padmabandha, etc Rāvu Koṇḍalarāya is the name of the author.

**Begining :**

క. శ్రీమత్సమస్త సద్గుణ
ధామా దనుజకులభీమ తారకనామా
కోమలజలదశ్యామా
రామా రఘువంశసోమ రాజలలామా.

అవధరింపుము.

గీ. పాలరుతాక . . . . మహిమ ?
రావుకొండలరాయుడు రమ్యమైన
సంస్కృతాంధ్రకవీంద్రుల సత్ప్రబంధ
రచితచిత్రంబులెల్ల యేర్పరచికూర్చి.
తదనుగతికొన్ని చిత్రబంధములు కల్పి
తములు గావించి యందుకు తగినపద్య
వితతి నడిమింటి వేంకటపతికవీంద్రుఁ
డెలమి రచియింప నవికవిహితముగాఁగ.
గంథవిస్తరంబు కడుజోలియనబడు
గాన సంగ్రహార్థ ఘటనలీల
ననరు చిత్రబంధదర్పణంబను పేర
కృతియొనర్చె సుకవి వితతి బొగడ.

వ. మరియు కవిత్వంబు ఆశు చిత్ర మధుర విస్తారంబులన చతుర్విధంబు లం . . . . . ను శబ్దాలంకారంబైన చిత్ర కవిత్వంబునందు ఏకానుప్రాస, యమక, పాదభ్రమక, పద్యభ్రమక, ముక్తపదగ్రస్త, ఓష్ఠ్య, నిరోష్ఠ్య, నామగోపన, పాదగోపన, పద్యాంతగర్భిత, పద్మబేధాది బహువిధంబులు కవిసమాకారంబుకొలంది తత్తద్గ్రంథంబు కలదుగావున విస్తరభయంబుగావున చిత్రప్రబంధంబులు మాత్రంబు కొన్ని పర్వరించి వ్రాసెద యెట్లనిన.

* * * *

**End :**

ఇట్లు శబ్దాలంకారంబైన చిత్రకవిత్వంబునందు బంధకవి . . .
పూర్వభాగంబునందు అఱువదినాల్గును ఉత్తరభాగంబునందు శాషే
షణాను ప్రాసంబాదిను: చక్రవాళచిత్రంబు కడపలగానఱువదినా
ల్గినును గూడి మూటయెనిమిది సుకవిజనానురంజనంబుగా ?రూపణంబు
విలసిల్లుచుండు.

క. చతురశ్రీహరినామాం
కితమగునిది చదువువారికి సతకృపతో
నతులైశ్వర్యములోస . . . . .
. . . . . పరదుండగు రామచంద్రుండు వేడకన్.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానస రావు
కొండలరాయ . . . . . . . చిత్రకవిత్వ దర్పణం
బునందు చౌషష్టిచిత్రంబులు గల ఉత్తరభాగం సంపూర్ణం.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతతిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యములేదు.
గ్రంథపాతములుగలవు.

చక్రబంధము, పద్మబంధము మున్నగు బంధకవిత్వ విశేషములు
అను ప్రాస విశేషములు నిందు లక్ష్య లక్షణములతో వివరింపబడి
యున్నవి. కర్త రావు కొండలరాయకవి. విశేషములకుదాహృత
గ్రంథ భాగముగ గాంచునది.

---

### R. No. 1046

Paper. Size, $9\frac{1}{2} \times 10\frac{1}{2}$ inches Foll 20 Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes Condition, good Printed

Restored in 1934–35 from a MS. R. No. 857.

కర్మవిపాకము.

**KARMAVIPĀKAMU.**

Foll. 19-b, 20 are left blank.

Incomplete.

(వి-వి).—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము
లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్. నెం 857 రు ప్రతికిది పుత్రిక.

## R. No. 1047.

Paper Size, 9½ × 10½ inches Foll 80 Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes Condition, good. Not printed.

**Restored in 1934–35 from a MS. R. No. 885.**

కన్యకాపురాణము (ద్విపద).

**KANYAKĀPURĀṆAMU.**

**Foll. 1 and 2 and 80 are left blank.**

**Complete.**

(తె-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్. నెం 885 రు ప్రతికిది పుత్రిక.

---

## R. No. 1048.

Paper. Size, 9½ × 10½ inches. Foll 90. Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good Printed.

**Restored in 1934–35 from a MS. R. No. 977.**

**KANYAKACARITRA.**

కన్యకచరిత్ర.

**Foll. 90-*b* is left blank.**

**Complete.**

**Beginning :**

క. శ్రీశైలవంశభూషణుఁ
డాశ్రిత జనకల్పభూజ మతులితమహిమో
ల్లాసియగు కృష్ణమాహ్వయుఁ
డేశికుఁడిల మాకునిచ్చు నిష్టవరంబుల్.

* * * *

**End :**

గ్రంథాంతమందీ వ్రాంతగలదు—

"కీలకనామ సం॥పు |బ|౧౨| గురుగుంట్ల మాకం గురప్ప వ్రాసిన కన్యకచరిత్ర సంపూర్ణము."

(తె-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిదే. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఆర్. నెం 997 రు ప్రతికిది పుత్రిక.

## R No. 1049.

Paper. Size, 9½ × 10½ inches Foll 206 Lines, 20 on a page Mode of writing; fair, but not free from mistakes Condition, good. Not printed.

Restored in 1934–35 from a MS. R. No. 677.

ఆనందకాననమాహాత్మ్యము.

ĀNANDAKĀNANAMĀHATMYAMU.

Foll. 1-*b*—3, 50, 51, 205 and 206 are left blank.

Complete.

**Beginning :**

౧. త్రిమూర్తిస్తవము.

౨. కలశపురీవర్ణనము.

౩. కృతికర్తవంశానుక్రమణిక.

౪. కవితాప్రేరకుఁడానందకానన మాహాత్మ్యమును జెప్పుమనుట.

* * * *

**End :**

ఇది శ్రీమచ్చతుర్వాటికానాయకచంద్ర . . .
. . . . . . . లక్ష్మీసంహితోక్తానందకానన మహాత్మ్యంబునందలి పంచమాశ్వాసము సంపూర్ణము. .

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఆర్. నెం 677 ఆ ప్రతికిది పుత్రిక. గ్రంథాదిని 92 పుటలలో దీనికి విషయసూచిక గలదు.

---

## R. No. 1050.

Paper Size, 9½ × 10½ inches Foll 12 Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good Not printed.

Restored in 1934–35 from a MS R. No. 902.

గణచతుర్థ్యుపాఖ్యానము.

GAṆACATURTHYUPĀKHYĀNAMU.

Fol. 1 is left blank.

Complete.

**Beginning :**

క. కరములు మోడ్చి నుతించెద
నిరతము ధరణీశమౌళి నిస్తులమణి రు
గ్వరశోభిత సత్పథ పం
కరుహుఁడగు వేంకటేశు ఘనగురువర్యున్.

* * * *

**End :**

సర్వజిత్తు నామ సం॥ శ్రా॥ బ॥ ౧౨ జయువారం సగ్కి ప్రతిగా నాగవరపు కామయ్య వ్రాసుకొనెను

(బి-బి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఆర్. నెం 902 రు ప్రతి కిది పుత్రిక.

---

## R. No. 1051.

Paper Size, 9¼ × 10¼ inches Foll 106 Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good Not printed

Transcribed in 1935–36 from a MS. of Sri M. Ramakrishna kavi garu, M.A. (Madras).

వసుంధరా పరిణయము.

VASUNDHARĀ PARIṆAYAMU.

Foll. 1 and 106-*b* are left blank.

Complete.

The marriage of Vasundharādēvi born as Satyabhāma with Lord Sri Kṛiṣnna is described in this work. Virarāghava Kavi of Nellore is the name of the author.

**Beginning :**

శా. శ్రీనారాయణు సన్నుతించి శివునిం జింతించి వాణీపురం
ధ్రీనాథున్వినుతించి శ్రీఁ దలచి గౌరిం గొల్చి వాగ్దేవతన్
ధ్యానారూఢను జేసి దంతిముఖునిం బ్రార్థించి కవ్యాజ్ఞచే
నానానీ రచనాచమత్కృతి ప్రబంధంబు న్నిబంధించెదన్.

* * * *

**End :**

మాలిని. జలజశరవిలాసా చంద్రికా చంద్రహాసా
జలధి కృతనివాసా చారుచాంపేయనాసా

ఖలభి దరినివాసా భక్తరక్షా ప్రయాసా
అలఘు గుణవిలాసా హారిసౌవర్ణవాసా

ఇది శ్రీమన్మదన గోపాల వరప్రసాద సమాపాదిత సంస్కృతాంధ్ర భాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితాబంధుర రచనాధురంధర సరసనాటకాలంకార సర్వస్వ విజ్ఞానధౌరేయ సుజనవిధేయ బుధగణ స్తోత్రపాత్ర కాశ్యపగోత్ర పవిత్రాపస్తంబసూత్ర నెల్లూరి గంగయామాత్యపౌత్ర వీరవేంకటపతి మంత్రిపుత్ర వినయ గుణభాస్వర వీరరాఘవ కవీశ్వర ప్రణీతంబైన వసుంధరా పరిణయంబను మహాప్రబంధంబునందు ఉత్తర భాగంబున పంచమాశ్వాసము. సంపూర్ణము.

(వి-వి).—

సమగ్రము. వ్రాంత యంత మంచిదగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

ఇందు, వసుంధరాదేవి సత్యభామగా జనించి శ్రీకృష్ణునిఁ బెండ్లి యాడినకథ వర్ణింపఁబడినది. కర్త నెల్లూరి వీరరాఘవ కవి.

---

R. No. 1052.

Paper Size, 9½ × 10½ inches Foll 62 Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good Not printed

Transcribed in 1935–36 from a MS of Sri M. Ramakrishnakavi garu, M.A. (Madras).

చారులీలా విలాసము.

CĀRULĪLĀVILĀSAMU

Fol. 1-*b* is left blank Wants beginning and End.

Incomeplete

The story of the marriage of Cārulīla, daughter of Sudarśana King of Sōbhāvati with Sārasadhvaja, son of Citraraśmi king of Srīnidhi is described in this work. Incidentally a portion of Hastādhyāya of Nātyaśāstra has also been explained.

**Beginning :**

. . . . . . . . . .

జీవనంబై యగోచర జీవభాగ
ధేయమై యొప్పు నప్పురశ్రేయు మిలను.

క. అన్నగరసాలంబు . . . . .
త్యున్నతమై నాకలోకయుక్తినమరు సం
పన్నత్వ మెన్న శక్యమె
పన్నగ పతిచేత గాదు భాషించుటకున్.

* * * *

**Colophon :**

ఇది శ్రీమదుమారమణ చరణారవింద సేవాసమాసాదిత కవితా విచిత్ర కౌశికగోత్ర పవిత్ర మారుపెద్ది తిరుమలరాయ పౌత్ర వేంకట రాయపుత్ర చెంగల్వరాయ నామధేయ ప్రణీతంబైన చారులీలావిలాసంబను ప్రత్యగ్ర ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

* * * *

**End :**

క. ప్రథమతిథి గళము మస్తక
మధరము చెక్కులు నితంబమర్త్యవిధముల్
గదియించి విటుడు గవసిన
సుదతికి రతిసౌఖ్యమెదను జొప్పడకున్నే.

. . . . . . . . . .

(వి-వి).—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాంత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

శోభావతీ నగరాధిపతియగు సుదర్శనుని కూఁతురు చారులీల, శ్రీనిధి పట్టణాధిపుడైన చిత్రరశ్మినందనుఁడగు సాగరసత్త్వుని స్వయంవరమున వరియించిన కథ యిందు వర్ణితము. ప్రసంగ సంగత్యా నాట్యశాస్త్ర మొదలి శాస్త్రాధ్యాయ భాగము లక్ష్యలక్షణములతో వివరింపఁబడి యున్నది. కర్త చెంగల్వరాయ కవి. కౌశికగోత్రుఁడు. మారు పెద్ది తిరుమలరాయని పౌత్రుఁడు. వేంకటరాయని పుత్రుఁడు. విశేషముల కుదాహృత గ్రంథభాగముఁ గాంచునది.

---

## R. No. 1053.

Paper. Size, 9½ × 10½ inches Foll. 58 Lines, 20 on a page Mode of writing, fair, but not free from mistakes Condition, good Not printed

Transcribed in 1935–36 from a MS. of Sri M Ramakrishna Kavi garu, M.A. (Madras).

వనమాలి విలాసము.

VANAMĀLIVILASAMU.

Fol. 1—3, 57-*b* and 58 are left blank.

Incomplete.

The story of the marriage of Mitravinda with Sri Krisnna is described in this work. Sūrayakavi, son of Nāranāmātya is the author.

**Beginning :**

. . . . . . . . . . . . . . .

కలువలు విందు చందంబునం గ్రొత్త ముత్తియంపు సరంబులు గరంబు
మెరయు నురంబునం . . . . . . ధగధగాయమానం
బగు కౌస్తుభ మహారత్నంబునకుం బ్రియంబు సమకట్టంగట్టిన . .
. . . . . మెచ్చులువచ్చు బచ్చనలు గానించిన చిత్తరుల
ప్రతిమల ప్రతిబింబంబులుంబోలె డాకాలం . . . . . .
గండపెండారంబున సాకారంబుగా వ్రాసిన కంసాదిరిపు నృపాల లోకం
బుల . . . . . కోటీరభార . . . . మహానిల
కూలం కషంబులై చీరువారు . . .

**Colophon :**

ఇది శ్రీమదింద్రేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసార నారనామాత్య
కుమార సూరిజన విధేయ సూరయనామధేయ ప్రణీతంబైన వనమాలి
విలాసమను మహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

**End :**

చిరకాల స్థితిజేయుః
నప్పుగిగ్ర్యపాసింధుండు వైకుంఠు . . . . .
. . రదర్పావహా . . . . . . .
బురుహాక్షీ కుచకుంకుమాంకము
స్వయంభూవాజిమేధా . . . .
. . . రవిస్ఫులింగముల
కోడ్గోత్రదాల్చునోనె . . . .

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. వ్రాఁత తిన్ననిదే. తప్పు
లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి.

అవంతి దేశాధీశ్వరుఁడైన కుందుడను వాని చెలియలు మిత్రవింద,
స్వయంవరమున శ్రీకృష్ణుని వరించిన కథ యిందు వర్ణితము. కర్త
సూరయ కవి, నారనామాత్యుని కుమారుఁడు.

R. No. 1054.

Paper. Size, 9½ × 10½ inches Foll. 34 Lines 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good.

Transcribed in 1935–36 from a MS. of Sri M. Ramakrishna kavi garu M. A. (Madras).

(A) లక్షణదీపికా.

LAKṢAṆADĪPIKA (Sanskrit).

Foll. 4-*a*—25.

Foll 1-*b*, 3 and 24-*b* are left blank. Not printed.

Complete.

Same work as that described under D. No. 12952 in Sanskrit. Catalogue.

(వి-వి.)—

ప్రాంత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథ పాతములున్నవి.

ఇది సంస్కృతము డి. నెం 12952 దున వర్ణితమయినదే కాని, యిందులో పాఠభేదములున్నవి.

(B) కవిగజాంకుశము.

KAVIGAJĀṄKUŚAMU.

Fol. 25-*b*—34. Foll. 25-*a* and 34 are left blank. Not printed.

Complete.

This is a work on prosody by Bhairava Kavi, son of Gaurana who is the author of Lakaṣṇadīpika.

**Beginning :**

క. శ్రీమత్పరమశివానన
తామరసవికాససలిల దనరిన భ్రమరాం
బామధుమత్తభ్రమరిక
నామానస సరసిరుహము నన్నివహించుఁగా.

* * * *

క. భ్రమరాంబికా మహావర
సముచిత నిరవద్య హృద్యసాహిత్యకళా
క్రమవిమల ప్రతిభాచం
క్రమణక్రమశాలియైన గౌరన సుతుండా.

భైరవుఁడ నభయాభాషా
పాలించుఁడ లోభిభవనభవభూమివ్యా
పారసవికార దుం . . .
ఘోరపిశాచుల నదల్చుకొను భైరవుఁడా.

* * * *

**End :**

మ. గణవర్ణాదుల మేలుగీడు దెలియంగా జెప్పె సాహిత్యల
క్షణదీప్తాగురుఁడైన గౌరన సుధీసత్పుత్రుఁడత్యంత స
ద్గుణరత్నాభరణుండు భైరవకవీంద్రుండు తద్జ్ఞులనుం
బ్రణుతింపం గవిరాడ్గజాంకుశమిలన్ బ్రఖ్యాతిఁ బెంపొందఁగన్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

ఇది యొక ఛందోలక్షణ గ్రంథము. ఇందు గణాధి దేవతలు, వర్ణములు, కులములు, గ్రహములు, నక్షత్రములు, రాసులు, శుభాశుభ ఫలములు మున్నగునవి వివరింపఁబడినవి. కర్త భైరవకవి. లక్షణదీపిక కర్తయగు గౌరన కుమారుఁడు.

---

## R No. 1055.

Paper Size, 10¾ × 9¾ inches. Foll. 105 Lines, 20 on a page. Mode of writing good and free from mistakes Condition, good. Not printed

Transcribed in 1935–36 from a MS. of Sri M. Ramakrishna kavi garu, M.A. (Madras).

చిత్రకేతు చరిత్రము.

CITRAKĒTUCARITRAMU.

Incomplete.

The story of Citrakētu contained in Bhāgavata is described in this work. Purusōttamakavi is the name of the author The work has been dedicated to God Siva at the instance of Pāpayāmātya.

**Beginning :**

శా. శ్రీగౌరీతరుణీమణీకుచలసచ్ఛ్రీగంధసారంబుసం
భోగాలింగనవేళ కంఠగరళంబుం దెల్పుగాఁ బింపగా
వాగీశాదిదివౌకసుల్దగిలి విభ్రాంతిం గనన్ బ్రువ్వ
వ్యాగారారు శశాంకశేఖరు నభీష్టార్థప్రదున్ వేడెదన్.

* * * *

వ. అమ్మహోత్సవమునం దఖిల దిశాగత విద్వత్కవి గాయకాది సమక్షమంబునం దత్తదుచిత కాలంబుల భగవత్కథానుసంధానపరాయణుండనై యుండ నొకనాఁ డప్పయామాత్య శేఖరుండు.

* * * *

మ. సకలాచారవిచారశీలుఁడవు శశ్వత్సంస్కృతాంధ్రాతిభా
వుక వాగ్జాలవిజృంభితుండవు కవివ్యూహంబు మేల్మేలనన్
సుకరార్థాప్తిగఁ గంసరాడ్విజయమున్ సోమేశ్వరప్రీతిగా
వికృతిం జెప్పితి వార్యసమ్మతమతీ విద్వద్గణాంచత్కృతీ.

* * * *

గీ. నెమలికంటిపురంబున నిలిచియున్న
విబుధసన్నుతు నాగేశ విశ్రుతాఖ్యు
కాళికేశ్వరు పేర నీకావ్యమిమ్ము
యుష్మదస్మదభీష్టమయ్యెడుప ధరుఁడు.

* * * *

వ. అని బహుమానపురస్సరాదరణ సంభావనంబుల భగవత్కృతి కియ్యకొలిపిన సయ్యన నయ్యెడ నపరిమితానంద సందోహకందళితాం తరంగుండనై కథానాయకాందోళంబున నుండ జీవేశ్వరాభేద తత్త్వ నిత్యశోధనుండును మహర్షిజన సంస్తూయమాన శైవాగమార్థసార ప్రబోధనుండును సూతసంహితాద్యనేక ప్రబంధ నిర్మాణకుశలుండును కొప్పరాడ్వంశ కలశపాథోనిధానరాకాసుధాకరుండును విద్వదగ్ర గణ్యుండును నగు నరసింహాభిధానుం డమరగురుం డింద్రునకుం బోలె నస్మన్మనోవిచికిత్సాపనోదంబుగా చిత్రకేతు మహారాజు మహా భాగవత చరిత్రం బతి పవిత్రంబధిక ప్రసిద్ధంబొనర్ప నీశ్వరప్రీతియు మహాభాగవత స్తుతియును నాయురారోగ్యైశ్వర్యాద్యఖిలైహిక సంప త్తియు సాలోక్యాది చతుర్వర్గ ఫలసిద్ధియు కలుగునని వక్కాణింప నవ్వాక్యగౌరవంబుంది ప్రతిశ్రవానందంబునం దేలుచున్న సమ యంబున.

* * * *

క. మన్ననచే వర్ణించెద
నున్న సేయంగనన్ను నూల్కొల్పిన శ్రీ ?
మన్నెమలికంటిబాహు
న్నొన్నతవంశక్రమంబు నుత్సాహముతోన్.

* * * *

గీ. నెచ్చెలికల్లు తమకు నెలవుగా గణికులై
సాగడుగనిరి వరుస భూతిమించి
సకలకార్యధరత జరిపిరివారితో
కొండమంత్రినా నొకండుబుద్ధై

* * * *

శ్రీమత్కైలాసాగ్రో
ద్ధామగుహాంతర విహార తాత్పర్యునకున్
సామజదానవహారునకు
కామంగమదాద్రిపవిసకాశాత్రునకున్.

* * * *

నమస్కార పురస్సరంబుగా నేనొనర్చెడు ఈ చిత్రకేతు మహా
రాజాభ్యుదయ చరితంబాదేవున కర్పించితి. పారాశర్య మునివర్య
విరచిత మహాభాగవత పురాణ రత్నాంతరిత తదుపాఖ్యానంబు కథా
సంకోచ విరళంబుగా స్వచ్ఛంద విహారంబు నొందితి తత్ప్రారంభం
బెట్లనిన.

**Colophon :**

ఇది శ్రీమదుమారమణ కరుణారసావిర్భూత కవిత్వవైభవ శ్రీమ
త్పాటిబండోత్తరామాత్య తనూభవ సూరిజనాంగీకారచరిత్ర భారద్వాజ
గోత్ర పవిత్ర సకల సజ్జనవిధేయ పురుషోత్తమ నామధేయ ప్రణీతంబైన
చిత్రమహాభాగవత చరిత్రంబునందాద మాశ్వాసము.

* * * *

**End :**

గీ. లింగదేహంబుతోన నిర్లింగలీల
గలసి తనువొత్తుకొనిపోయి కలితశక్తి
త్వష్ట వేల్చుమహాగ్నితో తగవసించె
పరులు తెలియంగ జాలరీప్రక్రమంబు.

(వి-వి.)—

అసమగ్రము. మొదటనుండి చతుర్థాశ్వాసములో కొంతభాగము
కలదు. వ్రాంత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాత
ములును లేవు.

ఇందు భాగవతములోని చిత్రకేతూపాఖ్యాన కథవర్ణితము. కర్త
పురుషోత్తమకవి. పాపయామాత్యప్రేరణచే నీకృతి శివునకంకితము
చేయబడినది. కృతిపతి కృతికర్తలవంశ వృత్తమిది.

(I) కృతిపతి వంశము.—




(II) కృతికర్త్ర వంశము.—




---

## R. No. 1056.

Paper size, 10¾ × 9¾ inches. Foll. 103. Lines, 20 on a page. Mode of writing, fair, but not free from mistakes. Condition, good Not printed.

Transcribed in 1935–36 from a MS. of Sri M. Ramakrishna Kavi-Garu, M.A., Madras.

విష్ణుపారిజాతము.

VISNUPĀRIJĀTAMU

Complete.

The story of taking away by Sri Krsna of the Pārijāta tree from the heaven contained in Bhāgavata is described in this in the form of a Yaksagāna. Tarigonda Veṅgamāmba is the authoress.

**Beginning :**

క. వర శేషాచలపతియగు
తరిగొండానాథుని పరమ కరుణిని వెలయన్
సురపారిజాత తరుకథ
సరుదుగ యింపెటి వెంగమాంబ రచించెన్ ॥
తత్కథోపక్రమప్రకారంబు మెట్లనిన.

నాట రాగము - దరువు.

శ్రీ రుక్మిణీలోల శృంగారసుఖలీల
కారుణ్యరసమూల కనకరుచిచేలా ॥
సూరిజననుత సురుచిరసుగుణజాల
ఘోరదనుజనిఫాల గోపాల బాల ॥ జయ జయ ॥

* * * *

ద్విపద. అని యిష్టదేవత నమరనుతించి
గొనకొని పరమ సద్గురునకు మ్రొక్కి
శ్రీవిఘ్ననాథుని క్షేత్రపాలకుని
శ్రీవాణిని హయగ్రీవుని దలచి
యటమీద తరిగొండ మాహాత్మ్యమందు
దిటముగా నుంచి భక్తిని బూజచేసి.

* * * *

**End :**

అరయ తరిగొండ నరహరియగుచు నందరికి
వరములొసగే శ్రీనివాసునకును,
మురియుచు విశ్వమోహనుఁ డిట్లు భరియించి
సిరుల వెలయుచు నుండు శేషాద్రికిని,
జయమంగళం నిత్యశుభమంగళం ॥

ఇది శ్రీ శ్రీ తరిగొండ వేంగమాంబా కృతంబైన శ్రీ విష్ణు పారిజాత యక్షగానము.

(ఐ-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

భాగవతమునందలి పారిజాతాపహరణకథ యక్షగానముగా వర్ణింపఁ బడినది. కర్త్రి తరిగొండ వెంగమాంబ.

గ్రంథాంతమున నిట్లున్నది—

" దుర్ముఖినామ సంవత్సర ఆషాఢ శుద్ధ ౯ గురువారమునకు సరియైన ౧౮౫౬ వ సం॥ జూలై నెల ౧౦ వ తేదిన శ్రీ తరిగొండ వెంగమ్మగారికి ముని మనుమడున్నూ వెంగమ్మగారికి కోడలైన చెంగమ్మగారికి మనుమడైన గరిడిమి . . . . . సుబ్బన్న కొమారుడైన గంగాధరప్ప గాదంశెట్టి పుల్లయ వ్రాసిన అసలు మాతృకనుపట్టి నేటికి సంపూర్ణముగా గ్రంథం పూర్తిగా వ్రాయడమైనది. "

---

## R. No. 1057.

Paper size, 10¾ × 9½ inches Foll 21 Lines, 20 on a page. Mode of writing, fair and free from mistakes Condition, good. Not printed

Transcribed in 1935–36 from a MS. of Sri M. Ramakrishna Kavi, M.A., Madras.

రమాపరిణయము.

RAMĀPARIṆAYAMU.

Complete.

The story of the marriage of Alamēlumanga with Sri Veṅkatēśvara who are believed to be the incornation of Ramā and Lord Viṣṇu is described in this work. Tarigoṇḍa Veṅgamāmba is the authoress.

**Beginning :**

ద్విపద. శ్రీవేంకటేశ్వరు చిత్తమందుంచి
భావించి తరిగొండపతిని పూజించి
శ్రీభారతిని హయగ్రీవుని దలచి
ప్రాభవంబున గురుం బ్రస్తుతి జేసి
కరమర్థితో రమాకల్యాణసరణి
తెరగొప్ప రచియింతు ద్విపదకావ్యముగ
ఘనమైన తత్కథా క్రమమెట్టిదనిన

* * * *

వనిబూని జలరాశిపట్టియై పుట్టి
యొనర నిన్నే కోరుచున్నదిచ్చోట
నీవాప్యగాతో పాణిగ్రహణంబు

గావింపవే నిత్యకల్యాణి యనిన
నవ్వుచు తరిగొండ నరహరి వేడ్క-
నిశ్చయిల్లగ వారిసం జూచి పలికె
గరళకంధర పద్మగర్భాదు లెల్ల
సరవిని వినుడొకట సరణి జెప్పెదను
భూలోకమున శేషభూధరమందు
నేలీలదిపింప నిలచియచోట
వెంకటేశ్వరుడన విఖ్యాతి బొంది
పొంకంబుగానుంచు భూపాలుకరణి
మచ్చిక నలమేలు మంగాభిదాన
మించి సంప్రీతి నాయిందిరాసతిని
నే శీఘ్రముగను పాణిగ్రహణంబు
జేసెదనని పలికె చిరునవ్వు గవ్వ
గురుతుగా వారి పీడొకటిని ముదంబెసగ
పరమాత్ముడంతండి పయనమై వచ్చి
శ్రీవరాహస్వామి చేకొనియున్న
శ్రీవేంకటాద్రిపై జేరివేడుకను
అప్పుడు శ్రీవరాహస్వామి నడిగి
తప్పక క్షేత్రంబు తానాక్రమించి
నలువొప్పతరిగొండ నరసింహుడనగ
విలసిల్లుచుండె శ్రీ వేంకటేశ్వరుడు

**End:**

అని యిట్లు శేషాచలాధీశుడైన
కనకాంబరుని పేర కమలేశుపేర
వరనొప్పగా నందవరకులోద్భవుడు
చెలువొందు సమరవాసిష్ఠగోత్రుండు
వసుధలో కానాలవంశవర్ధనుడు
రసికుడౌ కృష్ణార్యరమణి మంగాంబ
సుత వెంగమాంబ భాసురభక్తి తోడ
కృతిలేని శ్రీరమాపరిణయంబనెడి
వరకృతి ద్విపద కావ్యముగా రచించి
నరులెన్న తరిగొండ నరసింహుడైన
సదమల వేంకటాచలపతి దివ్య

పదయుగళికి సమర్పణముగా జేసి
కోరి సుబ్రహ్మణ్యగురు కటాక్షమున
సారమై యీ కృతి సర్వకాలంబు
భూచక్రమున మహాపుణ్యులు చదువ
నాచంద్ర తారార్కమై యుండుగాత

ఇది శ్రీ తరిగొండ వెంగమాంబా కృతంబైన రమాపరిణయంబను ద్విపదకావ్యంబు సమాప్తము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందు రమావిష్ణువులు అలమేలుమంగా వేంకటేశావతారములెత్తి పెండ్లియాడుటయను విషయము గలదు. ఈ కృతి వేంకటేశ్వరున కంకితము. కర్త్రి తరిగొండ వెంగమాంబ గ్రంథాంతమున నిట్లు గలదు—

"హేవిళంబి సంవత్సర కార్తికశుద్ధ౧, షష్ఠి సమాప్తము."

---

## R. No. 1058.

Paper size, $10\frac{3}{4} \times 9\frac{5}{8}$ inches. Foll 37. Lines, 20 on a page. Mode of writing, fair and free from mistakes Condition, good. Not printed

Restored in 1936–37 from a MS. D. No. 1278.

కవిచింతామణి.

### KAVICINTĀMAṆI.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

డి. నెం 1278 రు ప్రతికిది పుత్రిక.

---

## R. No. 1059.

Paper size, $10\frac{5}{8} \times 9\frac{5}{8}$ inches. Foll. 274. Lines, 20 on a page Mode of writing, fair and free from mistakes. Condition, good Not printed

Transcribed in 1936–37 from a MS. obtained from Mr. V. Narasimha-charya.

కళాపూర్ణోదయము (సటీకము).

**KAḶĀPŪRNŌDAYAMU (with meaning).**

Incomplete.

This work contains the commentary for the first three chapters of Kalāpūrnōdaya. The name of the author is Narasimhacharyulu of Vangipuram.

**Beginning :**

శా. శ్రీ లావణ్యవతీకుచద్వితయ కాశ్మీరప్రభాచారువ
క్షోలంకార మణిప్రకాండము నవీనారుణుండుగా సన్మనో
నాళీకావిరత ప్రభాతమగుచున్ భాసిల్లు తత్వంబు నం
ద్యాల శ్రీనరసింహకృష్ణవిభు నిత్యశ్రీయుతుం జేయుతన్ ॥

టీ. శ్రీ లక్ష్మీదేవియనెడి, లావణ్యవతీ = సుందరస్త్రీయొక్క, కుచద్వితయ = చనుదోయియొక్క, ప్రభా-రంగుచేతను, చారు = సొగసైనటువంటి, వక్షః = రొమ్మునందు, అలంకార = భూషణమైనటువంటి, మణిప్రకాండము = రత్నములలోమేటి, కౌస్తుభమాణిక్యము, నవీనారుణుండుగా = నూతనమైన సూర్యుడౌచూవుండగా, సన్మనోనాళీకావిరత ప్రభాతమగుచున్-సత్ = పెద్దలయొక్క, మనో = చిత్తములనెడి, నాళీక = కమలములకు, అవిరత = యెడతెగనటువంటి, ప్రభాతమగుచున్ = ప్రాతఃకాలమైనదై, భాసిల్లు = తేజరిల్లుచున్నటువంటి, తత్త్వంబు = తత్త్వము, నంద్యాల శ్రీ నరసింహ కృష్ణవిభున్—నంద్యాల = నంద్యాల వంశోద్భవుండైనటువంటి . . . . . . . . నిత్యశ్రీయుతున్, నిత్య = స్థిరమైనటువంటి . . శ్రీయుక్తున్ సం . . ను చేయుతన్ = చేయునుగాక. . . . నంద్యాల కృష్ణరాజును కృతిపతి . . . శాశ్వతమైన సంపదను జేయునుగాకయని దీవించుట.

అవ . . . సమస్త భూమినిన్ని యేలునుగాకయని యీ పద్యంలో చెప్పినాడు.

**End :**

ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళియమరనార్యతనూభవ సౌజన్యగేయ సూరయనామధేయ ప్రణీతంబైన కళాపూర్ణోదయమను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము,

శ్రీ వంగీపుర నరసింహాచార్యులచేత వ్రాయబడిన కళాపూర్ణోదయమనే కావ్యముకొరకు ప్రతిపద టీకయందు తృతీయాశ్వాసము.

(వి-వి.)——

అసమగ్రము. మొదటి మూడాశ్వాసములకు మాత్రను టీక గలదు. వ్రాంత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతము లున్నవి.

ఇందు కళాపూర్ణోదయమునకు టీకగలదు.

కర్త వంగీపురం నరసింహాచార్యులు.

---

## R. No. 1060.

Paper size, 6⅜ × 4-3/16 inches. Foll. 13. Lines, 26 on a page Mode of writing, fair and free from mistakes. Injured Not printed.

తులసీదళమాహాత్మ్యము.

TULASĪDALAMĀHĀTMYAMU (Song).

Incomplete.

The Sacredness of the Tulasi plant is described in this in the form of ballads. Kṛṣṇadāsa is the author.

**Beginning :**

. . . కంబు, వాసుదేవుపదవి . . . కటా ।
తెలుసుకొకమనసులోని తెగులు . . . లేచి బలము
తోను వేగరం . . ముగ్గపైనమాయెనూ ॥

**End :**

ధరణి కృష్ణసూర్యదాసు తులసి మహిమ సంస్కృతంబు ।
గరిమమీర ఆంధ్ర భాషగా రచించెనూ ।
వరకవిత్వంబుప్రజ్ఞ వాసుదేవు డిచ్చె నోటి ।
కరువుదీర కృష్ణదాసునికిని యిప్పుడు ।
పేరు వారనంగ లేదు వెలదిపురుషులైనగాని
కోరి యీ చరిత్ర బాడ భూరిధర్మమూ ॥
సువ్వి నారసింహదేవ సువ్వి రామచంద్రమూర్తి
సువ్వి గోపాలదేవ సువ్విలాలీ ॥

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. వైశేష్యగ్రంథ పాతములు గలవు.

ఇందు తులసీ దళమాహాత్మ్యము సువ్వి పాటలుగా వర్ణింపఁబడినది. కర్త కృష్ణదాసుఁడు. ఇందలి గ్రంథాంతరములు —Fol. 6 b, 7 b ఏకాంత సేవ. 7 b—10 a రుక్మిణీగోపాల సంవాదము. 10 a—11 b శ్రీ రంగాష్టకము. 11 b—13 b వేంకటేశస్తుతి.

---

## R. No. 1061.

Paper size, 7¾ × 6 inches Foll 19. Lines 20 on a page. Mode of writing, good, but not free from mistakes. Much injured. Not printed

**Presented in the year 1923–24 by T. V. K. Babu Rao in memory of his late father W. T. Linga Reddy Rao, Astrologer.**

అష్టకవర్గు ఫల వివరణము.

**AṢTAKAVARGU PHALA VIVARAṆAMU.**

**Complete.**

**This is a work on astrology (Aṣṭakavargu) explaining with suitable illustrations the favourable or unfavourable effects of plants when they are in certain positions. There is also a table of calculation (Chakara) attached to this.**

**Beginning :**

అథ అష్టకవర్గు ఫల గ్రంథముయొక్క వివరము. అథ త్రికోణ శోధన వివరముయొక్క చేబిలు మేషము, సింహము, ధనుస్సు, వృషభము, కన్య, మకరము, మిథునము, తులా, కుంభము, కటకము, వృశ్చికము, మీనము వీనియందు మూఁడు మూఁడు రాసులు యెత్తుకొని త్రికోణ శోధనచేయు విధము.

**End :**

రవి అష్టకవర్గు అంతు రేకులు ౪౮ రవి అష్టకవర్గు అంతు మొత్తం బిందువులు ౪౮. రేకులయొక్క సంజ్ఞ ఈ। పాళికవలె ఉండే ఊర్ధ్వగీటుకు రేకనే సంజ్ఞ యెఱుంగునది బిందువుయొక్క సంజ్ఞ ఈం పూర్ణానుస్వారమువలె నుండే నిండుసున్న వైఖరుకు బిందుసంజ్ఞ ఎఱుంగునది. ఈ బిందువులను ఉపయోగించవలసిన రవ్యష్టక వర్గములో ఉదాహరణ సహితము అష్టకవర్గువేయు విధము తెలియపఱచియున్నాను. దాని ప్రకారం రవ్యష్టకవర్గు వేసి ఈ పైని వ్రాసిన రవ్యష్టక వర్గునకు సరి చూచుకొని గ్రహించుటకు వ్రాసిన వివర చేబిలు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథ పాతములున్నవి.

ఇదియొక జ్యోతిష ఫల గ్రంథము అష్టకవర్గు చేయు విధము ననుసరించి రాసుల బలాబలములను, గ్రహముల శుభాశుభ ఫలములను నెఱుంగు విధము సోదాహరణముగా నిందు వివరింపఁబడినది. దీనికి సంబంధించిన పట్టిక (Table) చక్రమొకటిగలదు. కర్త పేరిందు గానరాదు.

---

## R. No. 1062.

Paper size, 8¼ × 7 and 13½ × 8½ inches Foll 79 lines, 24 to 33 on a page
Mode of writing, fair and free from mistakes Much injured Not printed

Presented in the year 1936–37 by Sri Sattirāju Sitārāmaiya Garu.

శంతనువిలాసము.

ŚANTANUVILĀSAMU.

Complete.

The story of the marriage of Śantanu with Gaṅga and Satyavati is described in this work. The author is Allamarāju Rāmakriṣna Kavi.

Beginning :

శా. శ్రీవత్సాంక మిలావధూటియుని లక్ష్మీభామ గోపింపఁ ద
ద్భావంబారసి పేరెదన్ వలుదగుబ్బల్ నొక్కి లేనవ్వుతో
నీవక్షోజమ్మగి ముదాంకమలివేణీ చూచితే యంచు న
ద్దేవీరత్నముఁ జూరడించు హరి భక్తిం గొల్తు సత్రాంతమున్
* * * *

సీ. వేదవేదాంతార్థ విదుఁడు బ్రహ్మణ్యుఁడె
ద్ధాత్రి నెవ్వానికిఁ దాత తండ్రి
సకలవిద్వజ్జన స్తవనీయ వైభవో
జ్జ్వలుఁడు రంగప్ప యెవ్వాని తాత
ప్రకటిత సత్య వాగ్వైభవారుఁ డెల్లనా
వ్యాయాధీరు డెవ్వాని యనఁగఁ దండ్రి
నిత్యసత్య వ్రత స్తుత్యశీలాన్విత
నరసాంబ యెవ్వన్యవరుని. జనని
తే॥గీ. యట్టియల్లమ రాజ వంశాబ్ధిచంద్రు
నమితగుణసాంద్రు హరిహరా ర్చాభిరక్తు

జతుర కవితాలవాలు సజ్జనవరేణ్యు
మజ్జనకు రంగధామార్యు మది దలంతు॥

క. నరసమ్మతనయములరగ
నరసమ్మతనయుని మజ్జనకుని న్వేదాం
తరహస్యజ్ఞు నుతించెద
సరసాంధ్ర కవిత్వనిధిని సమ్మతినెపుడున్॥

వ. ఇట్లు ఖిలభువన ప్రధాన దేవతా గురుజన నమస్కరణంబును బురాతనాధునాతన సంస్కృతాంధ్రకవి బహూకరణంబును కుకవి నిరాకరణంబును గావించి యే నొకరు మధురకావ్య రచనాకుతూహలుండనై యప్పుడు

సీ. అనురంగ వైనతేయ విజయంబను కృతి
సత్యభామా విలాసంబు నచ్చ
తెనుఁగునందగు ద్రౌపదీ పరిణయమును
గౌతమీమాహాత్మ్యకథ తెనుఁగు
విశ్రుత సతీభర్తృ వెలయుం గవిచకోర
చంద్రోదయంబను సరసకృతియు
ననమాన హనుమదాఖ్యానంబును సుకవి
జనమనోరంజనంబనెడు కావ్య
మెనయుగీతి నశోభాపరిణయము నొనరఁ
గూర్చి జగదేక విఖ్యాతిఁ బేర్చి సుమతి
నేర్చి వేల్పులలోపల నేర్చి శివుని
కంకితమొనర్చి మఱియు నిట్లని మనమున

* * * *

క. శ్రీలలనాస్త్ర నఘటితవి
శాలోరస్థలున కఖిలసజ్జనగణర
క్షాలోలునకున్ హాటక
చేలునకున్ భరితహితకుచేలునకుఁ దగన్॥

* * * *

వ. అర్పణంబుగా నాయొనర్పంబూనిన శంతను విలాసంబను శృంగార రసప్రబంధంబునకు నిధానంబగు కథావిధానం బెట్టిదనిన.

**Colophon :**

ఇది శ్రీమదల్లమ రాజాన్వయమాలికారత్న రంగధామార్య వర్య తనూభవ శ్రీమద్భీమేశ్వర వరప్రసాదలబ్ధ సరసకవిత్వ పటిమాసామ్రాజ్య

ధురంధర హారిత సగోత్ర పవిత్రైక కాశ్యపగోత్ర శతగ్రంథకల్పనాధిచిత్ర సకల సజ్జన విధేయ రామకృష్ణ కవి నామధేయ ప్రణీతంబైన శంతను విలాసంబను శృంగార రసప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

**End :**

గద్య. ఇది శ్రీమదల్లమ రాజాన్వయ మాలికారత్న . . .
. . . . . వ . . . . . పంచమాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములున్నవి. మొదటి 30 పత్రములలో నొక ప్రక్కను మాత్రమే వ్రాయఁబడియున్నది.

శంతనుఁడు గంగాసత్యవతులఁ బెండ్లిచేసికొని సుఖముగా నుండిన కథ యిందు వర్ణింపఁబడినది. కర్త అల్లమరాజు రామకృష్ణ కవి. హారితసగోత్రుఁడు. వైనతేయ విజయము, సత్యభామా విలాసము, అచ్చతెనుఁగు ద్రౌపదీ పరిణయము, గౌతమీ మాహాత్మ్యము, కవిచకోరచంద్రోదయము, హనుమదాఖ్యానము, సుకవిజన మనోరంజనము, సుశోభా పరిణయము నీతని యితరకృతులు.

గ్రంథాంతమున నిట్లుగలదు.——

" ప్రవనామ సంవత్సర అధిక కార్తిక శుద్ధ సప్తమీ భౌమవాసరం వరకు వ్రాయబడెను. "

---

## R. No. 1063.

Paper size, 8¼ × 7 inches. Foll. 99 lines, 22 on a page. Mode of writing, fair and free from mistakes. Much injured. Printed.

Presented in 1934–35 by Sattirāju Sitāramaiya Garu.

వరాహపురాణము.

**VARĀHAPURĀṆAMU.**

Same work as that described under R. No. 411.

Complete.

(వి-వి.)——

సమగ్రము. వ్రాతమంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతము లధికములు,

ఇయ్యది ఆర్. నెం 411 రున వర్ణితమైనదే. గ్రంథాంతమున నిట్లు గలదు.

"సీ. శాలివాహన శక సంవత్సరంబులు
చంద్రర్తు గిరిచంద్ర సంఖ్యదనర
వలనొప్పంగ వికారి వత్సర శ్రావణ
శుద్ధతృతీయను సోమవాస
రమున వరాహపురాణంపు ప్రతినున్న
క్రమముగా బుధజన ప్రతతియలగ
. . గతవంశోద్భవుడగు నరసప్పకుం
దినయుడౌ సింహాద్రి వినయమునను
సొంతముగ వ్రాసె నీకృతి జదువువారి
కఖిల సంపచ్చిరాయువు లవనియందు
గలుగు పరలోక సౌఖ్యము ల్వెలయుచుండు
నిందిరేశుని సత్కృపాదృష్టివలన."

---

**R. No. 1064.**

Paper size, 11 × 9¾ inches Foll 193 lines, 20 on a page. Mode of writing, fair and free from mistakes. Condition, good Not printed

Restored in 1940–41 from a MS. D. No. 2597.

(A) కరిణికోద్భవమంజరి.

KARIṆĪKŌDBHAVAMAÑJARI.

Foll. 1—34, 1-*b*, 2, 33-*b* and 34 are left blank.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిదే. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

డి. నెం 2597 ర ప్రతి కిది పుత్రిక.

(B) కళ్లజాతిచరిత్ర.

KAḶḶAJĀTICARITRA.

Foll. 35—42 ; 35-*b*, 40-*b*, 41 and 42 are left blank.

Complete.

(ఓ-ఓ.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

ఇయ్యది డి. నెం 2600 రు ప్రతికి పుత్రిక.

(C) తిరునాళ్ల దండకము.

**TIRUNĀḶḶADANḌAKAMU.**

**Foll. 43—68, 43-*b*, 44, 66-*b*, 67 and 68 are left blank.**

**Complete.**

(ఓ-ఓ.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

ఇయ్యది ఆర్. నెం 717 రు ప్రతికి పుత్రిక.

(D) తులసీదళ మాహాత్మ్యము.

**TULASĪDAḶAMĀHĀTMYAMU** (Song).

**Foll 69—80 69-*b*, 70 and 80-*b* are left blank.**

**Incomplete.**

(ఓ-ఓ.)—

అసమగ్రము. వ్రాత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

ఇది ఆర్. నెం 1060 రు ప్రతికి పుత్రిక.

(E) భాగవతము.

**BHĀGAVATAMU.**

**Foll. 81—140, 81-*b*, 82, 139-*b* and 140 are left blank.**

**Incomplete.**

(ఓ-ఓ.)—

అసమగ్రము. వ్రాత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

ఇయ్యది ఆర్. నెం 670 రు ప్రతికి పుత్రిక.

(F) కృష్ణశతానందీయము.

KṚṢṆAŚATĀNANDĪYAMU.

Foll 141—193 ; 141-*b*, 142, 143-*b*, 190-*b* to 193 are left blank.

Incomplete

(వి-వి.)—

అసమగ్రము. మొదటినుండి తృతీయాశ్వాసమునఁ గొంత వఱకుఁ గలదు. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథ పాతములును లేవు.

ఇయ్యది డి. నెం 473 రు ప్రతికి పుత్రిక.

---

R. No. 1065.

Paper size, 11 × 10 inches. Foll. 179 lines, 20 on a page. Mode of writing, fair and free from mistakes. Condition, good Printed.

Restored in 1940–41 from a MS R No. 1063

వరాహపురాణము.

VARĀHAPURĀṆAMU.

Foll 1-*b*, 2, 178 and 179 are left blank.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

ఆర్. నెం 1063 రు ప్రతికిది పుత్రిక.

---

R. No. 1066.

Paper size, 11 × 10 inches Foll 110 lines, 20 on a page Mode of writing, fair and free from mistakes Condition, good Not printed

Restored in 1940–41 from a MS. R. No. 1062.

శంతనువిలాసము.

ŚANTANUVILĀSAMU.

Foll. 1-*b*, 2, 108 to 110 are left blank.

Complete.

(వి-వి.)—

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాతములును లేవు.

ఆర్. నెం 1062 రు ప్రతికిది పుత్రిక.

---

## R. No. 1067.

Paper size, 11 × 10 inches Foll 235 lines, 20 on a page Mode of writing, fair and free from mistakes Condition, good Not printed

Restored in 1940–41 from a MS. R. No. 432.

రామరసామృతసింధు రామాయణము.

RĀMARASĀMṚTASINDHURĀMĀYAṆAMU.

Foll. 1-*b* and 2 are left blank.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. మొదటినుండి యుద్ధకాండవఱకును గలదు. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములును లేవు.

ఆర్. నెం 432 రు ప్రతికిది పుత్రిక,

---

## R. No. 1068.

Paper size, 11 × 10 inches. Foll 138 lines, 20 on a page. Mode of writing, fair and free from mistakes Condition, good.

Restored in 1940–41 from a MS. R. No. 716.

దేవీభాగవతము (తృతీయస్కంధము).

DĒVĪBHĀGAVATAMU.

Foll. 1-*b*, 2 and 138-*b* are left blank.

Complete.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యగ్రంథపాతములును లేవు.

ఇయ్యది ఆర్. నెం 716 రు ప్రతికి పుత్రిక.

## R. No. 1069.

Paper size, $10\frac{3}{8} \times 9\frac{1}{2}$ inches Foll 80 lines, 20 on a page Mode of writing, fair and free from mistakes Condition, good Not printed.

Transcribed in 1921–22 from a MS. of M.R.Ry. Kottaiya Sastri Garu, Ivani, Peddavadlapudi R.S., Tenali taluk.

భాగవతము (షష్ఠస్కంధము).

BHĀGAVAṬAMU (6th Skandha).

Foll. 1-*b*, 2, 79 and 80 are left blank.

Hari bhaṭṭāraka (vide notice under R No 681) is the author of this work, based on the Sanskrit Bhāgavata.

Incomplete.

**Beginning:**

శా. శ్రీ నీలాచలనాథునంచితదయాసింధు౯ జగన్నాయకు౯
నానా వైభవసంయుతు౯ మునిజనానందాలయు౯ సర్వదే
వానీకస్తుతకూడ రత్నరుచి దీప్తాంఘ్రిద్వయీ శోభితు౯
సూనాస్త్రిప్రభవాయుతు౯ హరిని సంసేవింతు నెల్లప్పుడు౯.
* * * *

**End:**

గద్య. శ్రీ హనుమత్కటాక్ష లబ్ధవరప్రసాద సహజ సారస్వత చంద్రనామాంకిత విద్వన్మణి అష్ట ఘంటావధాన పరమేశ్వర హరిభట్టారక ప్రణీతంబైన భాగవత పురాణంబునందు * * * * *

చిత్రకేతూపాఖ్యానంబును, పుంసవనవ్రతప్రకారంబు నాదిగాఁగల కథలుంగల షష్ఠస్కంధము.

(వి-వ.)----

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్య గంథపాతములును లేవు.

భాగవతమందలి యీ షష్ఠ స్కంధమునకు హరిభట్టారకుఁడు కర్త. ఇతనిం గూర్చి ఆర్. నెం 681 రును చూచునది.